శ్రీరస్తు

# సీతమ్మ పెండ్లికత

పానగల్ రాజాగారగు

రాజా పానగంటి పార్థసారథిరాయనింగారు, బి, ఏ,

రచియించినది



తిరుపతి.

శ్రీతిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాశాలయందు ముద్రితము.

౧౯౪౮

శ్రీరస్తు

# సీతమ్మ పెండ్లికత

[illegible]

రాజా పానుగంటి [illegible]రాయనింగారు. బి, ఏ,

[illegible]



తిరుపతి.

శ్రీతిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాశాలయందు ముద్రితము.

౧౯౪౨

# ప్రస్తావన

౧౮౯౬ సంవత్సరములో నేనొక చిన్నకతను గల్పించి గీతపద్యములలో వ్రాయనుద్దేశించి ప్రారంభించి ౧౭౬ వఱకు పద్యములను వ్రాసితిని. ఆవలనేమి కారణముచేతనో ఆప్రయత్నము అంతటితో ఆఁగిపోయినది. మరలనది జ్ఞాపకమేరాకుండ ననేక సంవత్సరములు గడచిపోయినవి. ఇట్లుండఁగా గడచిన సంవత్సరము ౧౯౪౭ తోడను ఏదోపనిమీఁదఁ బ్రాఁతకాగితములలో వెదకుచుండఁగా నీపద్యములను వ్రాసియుండిన పుస్తకము కంటఁబడినది. దానిని బూర్తి చేయవలెనని బుద్ధిపుట్టినది. ఆయుత్సాహము కొంతసేపటికిఁ గొంతతగ్గినది. వయసుచాల ఎక్కువైనది. కంటిచూపు వేగముగాఁ దగ్గుచున్నది. ఇట్టిస్థితిలో దానిని జక్కఁగాఁబూర్తి చేయఁగలనాయని సందేహము పొడమినది. కాఁబట్టి కథను సంగ్రహముగా వచనముగా వ్రాసి నిదానముగా సాధ్యమైనంతటఁ బద్యములతోఁ గూడ వ్రాయఁదలఁచినాను. చదువరుల యాదరమును వేఁడుచున్నాఁడను.

ఈసీతమ్మ పెండ్లికతను ముద్రించునప్పుడు అచ్చుచిత్తు ప్రతిని గడవఱకు విసుగులేకుండఁజూచి తప్పులు దిద్దినందులకు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారికి నాకృతజ్ఞతాపూర్వకానేక నమస్కారములను సమర్పించు చున్నాను.

బుధవిధేయుఁడు

పానగల్ మహల్
పానగల్లు
౩—౩—౪౮.

పానగంటి పార్థసారథిరాయనింగార్

శ్రీరామ

# సీతమ్మ పెండ్లి కత

క॥ ఇలువేల్పుల సీతారా
ములఁ గోరిక లేకయు మది, ముదమారంగన్
లలిత దయామృతమతులన్
గొలుతున్ గులదేవతల సుగుణ సంయుతులన్॥

రంగరావు—రామరావు తండ్రి, ఒక జమీందారుఁడు

రామరావు—కథారంభము చేయువాఁడు, రంగరావు కొడుకు

బాలయ్య—రంగరావు పెంచినయాతఁడు

కేశవరావు—సీతమ్మ తండ్రి, గొప్ప కుటుంబమువాఁడు

కృష్ణరావు—సీతమ్మను పెండ్లాడఁ గోరిన యాతఁడు. రాజమహేంద్రవరము వాస్తవ్యుఁడు. అక్కడ ఎక్కువ పలుకుబడి కలవాఁడు

శంకరయ్య—బాలయ్య మదరాసులో నుండఁగా నతనిని బోషించిన మదరాసులోని పెద్దమనుష్యుఁడు

సుబ్బయ్య—సీతమ్మ పెండ్లిసంగతి కేశవరావుతోఁ బ్రచారము చేయను కృష్ణరావు పంపినయాతఁడు.

వీరయ్య—కేశవరావు మిత్రుఁడు

ఒప్పులు—కేశవరావునొద్ద కొలువున్నవాఁడు

లక్ష్మీదేవి—రంగరావు భార్య

చిన్నమ్మ—కేశవరావు భార్య

సీతమ్మ—కేశవరావు కూతురు. కథానాయక

గీ॥ ఎలమిఁ జేపలఁ బట్టంగ ♦ నెంచినీట
వేడ్క నెర వేసి యొడ్డున ♦ వేచియుండు
గాలకాఁడనవనరాసి ♦ కడను బ్రబలి
వరలుచుండెడు బందరు ♦ పురవరంబు ॥ ౧

గీ॥ అట్టిబందరు పట్టణ ♦ మందు నేను
బుట్టి పెరిగితి నప్పుడు నా ♦ యట్టివారిఁ
గూడి వేడుక జలనిధిఁ ♦ గ్రుంకులిడుచు
శైశవక్రీడలనుజాల ♦ సలుపుచుందు ॥ ౨

గీ॥ చిన్నతనమున నేనిట్లు ♦ సింధుతీర
భూమివసియించు కతమునఁ ♦ బొడమినట్టి
యాంబుధముపైని మోహంబు ♦ నడపరాదు
జీవనాపేక్ష నేరుత్య ♦ జింపఁగలరు ॥ 3

గీ॥ చెన్నపురి వార్థితీరంబు ♦ చెన్నుమిగులఁ
బొగడవినుచుంటి బందరు ♦ పురమునందు
గానఁగడు వేడ్కపడుచుందు ♦ దానిఁగనఁగఁ
జెన్నపురి కెప్డు పోవనో ♦ యన్న కోర్కె ॥ ౪

గీ॥ ఇట్టులుండఁగ నేఁ జెన్న ♦ పట్టణంబు
కేగనవసరంబొటయు ♦ నెలమిఁబోయి
యచటిపనులను గావించి ♦ యవల నేను
కడలిదరిసౌరుఁ గనుగొనఁ ♦ గానుజసితి ॥ ౫

గీ॥ చెన్నపురి యమ తీరంబు ♦ సిరిని నేను
నదిమొకాంచుట నాంటిన ♦ మగుటఁజేసి
కడలి కడకేగి నేనటఁ ♦ గాంచినట్టి
వింతలను గొన్ని వివరింప ♦ వేడుకయ్యె ॥ ౬

గీ॥ పనులఁజనువారికి విహార ♦ మునకు నఱుగు
వారికిక్కట్టు లేకుండఁ ♦ బరఁగు కొఱకు
గౌతులకు బండ్లకును జన ♦ ప్రాణములకు
వేఱువేఱుగ బాటలు ♦ వెలయుచుండు ॥ ౭

గీ॥ జలధికడఁజేర మూడర ♦ జాముగాన
నీడలెంతయుఁ బొడవులై ♦ నీటుగాంచ
నెండశమియించె నీటిప ♦ నుండిగాలి
చల్లఁగను మెల్లఁగావీవ ♦ సాగెనపుడు ॥ ౮

గీ॥ ఒక్కప్రక్కను మబ్బులో ♦ నుండివెడలి
సూర్యకిరణముల్ ప్రసరించెఁ ♦ జోద్యముగను
గ్రోవిఁజిమ్మఁగనందుండి ♦ యావరించు
రజతజలధారలోయన ♦ రమ్యముగను ॥ ౯

గీ॥ ఓడదూరపువృక్షము ♦ లొకటియగుచు
కట్టుచాలుపురీతిని ♦ గానుపించె
చేరువనుగ్రాలుచుండిన ♦ చెట్టుతెల్ల
వెలసెఁబ్రత్యేకమయిదాని ♦ పిల్లలనఁగ ॥ ౧౦

గీ॥ ఒకట సివమెత్తి తలద్రిప్పి ♦ వెకలులనఁగఁ
కూడికలు గ్రోలి వెసనాడు ♦ చేడె లనఁగఁ
తాండవము సల్పుసివసత్తి ♦ పింఛములనఁగఁ
గాలికౌఁగిటవృక్షముల్ ♦ కదలుచుండె ॥ ౧౧

గీ॥ ఆకసంబునఁ జనుచుండి ♦ యవనిఁ గనఁగ
మహికవతరించిన విమాన ♦ మాడలి యనఁ
నంతటంతట గొప్పని ♦ గ్గైనయట్టి
మేడలంబుధి చేరువ ♦ మిసిమిగ్రాలు ॥ ౧౨

గీ॥ పెక్కురంగులఁ గైసేసి ♦ పేర్మిఁతోడఁ
చెరకుమాటునఁ గనుచుండు ♦ తెఱవలట్టు
బారిమధ్యమునందలి ♦ యుప్పరిగలు
చెట్లసందులఁగనుపించుఁ ♦ జెలువుమీఱ ॥ ౧౩

గీ॥ పలు తెఱంగుల గుడారాలఁ ♦ బ్రజ్ఞ నెక్కు
తమహయారూఢి సామర్థ్య ♦ మమరఁ దెలుపు
రీతిఁ జనుచుండురిట్టట్టు ♦ కౌతుకముల
తిరిగి యొక ప్రక్క హాయ మెక్కు ♦ తెల్లసగులు ॥ ౧౪

గీ॥ చక్రములు మ్రోయ "ఫ్యా" క్కని ♦ చబుకు మొరయ
వెనుకమూలల "హాయ్‌హాయ" ధ్వనులు చెలఁగ
వెంటరేఁగిదుమారంబు ♦ మింటికెగయ
రథము లెప్పుడు చనుచుండు ♦ రథ్యలందు ౧౫

గీ॥ ఎదుటవచ్చెడి మిత్రుల ♦ నెలమిఁగాంచి
మొలకనగవొప్పఁ దలయూఁచి ♦ పలుకరించి
కేలగ్రహియించి ముచ్చట ♦ లోలిఁ గొనుచు
వరుసఁ జనుచుందురనిశముఁ ♦ బద్యలందు ॥ ౧౬

గీ॥ చనుచు నీసొంపులెల్ల నేఁ ♦ గనుచునుండ
హయఖురోద్ధూత ధూళితన్నా ♦ క్రమింప
దుమ్ముక్రమ్మిన మోమును ♦ దోఁపఁజేయఁ
దఱచుదిననాథబింబంబు ♦ నెఱుపుఁగాంచె ॥ ౧౭

గీ॥ కోటబురుజులపడగల ♦ నీటుఁజూప
గాలివాటముననుబొఁగ ♦ గ్రమ్ముచుండ
జలధిలోపల నోడలు ♦ వెలయు, నిప్పు
గట్టులనఁగను సంద్రంపుఁ ♦ బొట్టెలనఁగ ॥ ౧౮

గీ॥ చిలువపడగ చాలుపులీల ♦ నలలు వెలయు
వెండితీవెల గతినందు ♦ ఫేనమొప్పు
శీకరంబును ముత్యాల ♦ చేరులట్లు
చూప నెంతయు సంద్రంబు ♦ సొంపుదనరె ॥ ౧౯

గీ॥ బిడ్డలాటలఁ ద్రోవల ♦ నడ్డగించు
చెలువుఁ బ్రక్కప్రక్కకుఁబాఱి ♦ చీమచిటుకు
మనినఁ గనుమూయులోపల ♦ మనికిపట్టు
జొచ్చుకర్కటంబులవేడ్కఁ ♦ జూడ నొప్పు ॥ ౨౦

గీ॥ ఇట్టియొప్పులఁ గాంచుచు ♦ నిసుకలోనఁ
బాదమూనంగ లోనికిఁ ♦ బఱచుచుండ
మెల్ల మెల్లఁగ నడచుచుఁ ♦ జల్లగాలి
ననుభవించుచు ముందుకుఁ ♦ జనెడు నపుడు ॥ ౨౧

గీ॥ తేనెబొట్టుచుఁ బ్రానుగూడు ♦ వేనవేలు
చీమబారులతీరునఁ ♦ జెన్నుమీఱి
జలధి తీరమునందునఁ ♦ జాలుతీరి
చేరెఁ బలువితంబులునైన ♦ తేరుగములు ॥ ౨౨

గీ॥ పైటఁ బచ్చికనేలల ♦ వ్రాలియున్న
చిత్రవర్ణపు రెక్కలఁ ♦ జిలుక పురువు
డాల్చుగతిని ముక్కోణంపుఁ ♦ దడకలొప్ప
నొప్పుమీఱిన తెప్పల ♦ మెప్పుమిగెలె ॥ ౨౩

గీ॥ తూలివారల తమవాటు ♦ దోఁపుఁ గొనుచు
దండిగాఁ బలుచేపల ♦ నిండియుండు
వలల నీటిలోలాగుచు ♦ వలలఁ గొనుచు
నఱుగుచుండిరి యిటనట ♦ నన్నిచోట్ల ॥ ౨౪

గీ॥ వింతజంతువు నొకదాని ♦ నంతఁగాంచి,
కదలుచుంట సజీవముగాఁ దలంచి
యేమిజంతువో యని దాని ♦ యెఱుఁగుకొఱకుఁ
జనితిమెల్లఁగ ముప్పిరి ♦ గొనెడివేడ్కఁ ॥ ౨౫

గీ॥ నీటనుండెడిజంతువో ♦ నేలనుండు
జంతువోయని వివరింపఁ ♦ జాలకనికిఁ
జొచ్చిపోవక తిలకించి ♦ చూడనదియు
నౌరమోమందు మానవ ♦ వ్యక్తియయ్యె ॥ ౨౬

గీ॥ అబ్బురంబొంది యటఁగొంత ♦ యాగినిలిచి
మానవ వ్యక్తియగుటచే ♦ మానిభయము
చనతినా ప్రక్క మెల్లగఁ ♦ జనవుతోడఁ
బలుకరింపఁగవలెనన్న ♦ తలఁపు గలిగె ॥ ౨౭

గీ॥ అన్నిపనులందును సహాయ ♦ మగుచునుంట
జేతియొరయిక నలుపైన ♦ చేతికఱ్ఱ
ప్రక్కసిద్ధముగానుండె, ♦ వరిలె నెదుట
నలలపైటఁ దెచ్చినకొయ్య ♦ పలకయొకటి ॥ ౨౮

గీ॥ పనునోయ్యన నగిప్రక్క ♦ కేగినిలిచి,
వాడునాత్తుతలయెత్తి ♦ చూడనునికి
రొంటిపైనను జేతులు ♦ రెంటినూని
కొంతసేపట్టులతనిఁగ ♦ న్గొనుచు నుంటి ॥ ౨౯

గీ॥ ఉదధిలోపల వీడిన ♦ యోడకొయ్య
వీచికలు గొట్టుకొనివచ్చి ♦ వేయనచట
నున్నయాకొయ్యనాతండు ♦ మున్నిడుకొని
యట్టులాసక్తిఁ గనుచుండ ♦ నెట్టికతమొ ॥ 30

గీ॥ చేరువందున్న కొయ్యను ♦ జేరి నేను
నెత్తిమనపిల్లదానిపై ♦ హత్తినట్టి
పట్టుకొంచు విశ్వసింతుం ♦ డగుచు దాని
రూపుదాల్చిన చింతాస్వ ♦ రూపమనగ ॥ ౩౧

గీ॥ రిత్తవడి కొంతవడినుండి ♦ చిత్తమెఱియ
వాఁడు మెల్లఁగఁ బ్రాణముల్ ♦ గూడిపిల్ల
నొయ్యఁదలయూచి ప్రేమతోఁ ♦ గొయ్యపైనఁ
దుడుచుచుఁ బసిబిడ్డమోమును ♦ దాడుచుకరణి ॥ ౩౨

గీ॥ తుడిచియాటఁ జెక్కియున్న వ్రాల్ ♦ నుదుపుకొనుచు
లోనఁ బొంగెడి దుఃఖంబు ♦ మానలేక
కఱఁగి సీతైన మనసంతఁ ♦ గంటనుండి
వెలికిఁ బఱచుచుఁ గన్నీరు ♦ వెడలఁదొడఁగె ॥ ౩౩

గీ॥ బొమలు ముడివడె నాసాపు ♦ టములు వడఁక
నప్రయత్నంబ కోపమో? ♦ యడఁపరాక
క్రిందివంకకు విలురీతిఁ ♦ జెందనంతఁ
జిత్రగతిఁ దోఁచె మొగమెల్లఁ ♦ జేవురింప ॥ ౩౪

గీ॥ కొలుకులను నిండియుండుండి ♦ చిలుప లగుచుఁ
గన్నులను బాసి కన్నీరు ♦ కాలువలుగఁ
గట్టదెగినట్టి చెరువునీ ♦ రట్టులుబికి
గీఱలందున మఱకలై ♦ జాఱిపడియె ॥ ౩౫

గీ॥ కొంతసేపట్లు పలవించి ♦ యంతసలసి
చేతసిరమూను మిన్నుమీఱు ♦ చింతఁజేసి
చలువసోఁకిన నాని ♦ జలములగును
నదియుమిన్నుమీఱఁగట్టిగా ♦ నగునుగాదె ॥ ౩౬

గీ॥ శోకమిట్లాల స్తంభింప ♦ బైకిఁబొంగి
హృదయ మసలించురీతిని ♦ బాదలుచుండ
శ్వాసమిబ్బంది పడుచుండ ♦ జాలిగొలుప,
గోడుగోడని వెతలను ♦ పందుమరల ॥ ౩౭

గీ॥ ఇంతసేపాడ నేనుంట ♦ నెఱుఁగఁడతఁడు,
మఱచితనలోకమునఁ దాను ♦ మగ్నుఁడగుట,
ఇంద్రియజ్ఞానమంతయు ♦ నేకమగుచుఁ
గొయ్యపై నుంట, నెఱుఁగఁడే ♦ మయ్యెనెదుట ॥ ౩౮

గీ॥ ఒక్కటొకయవయవమున కెందు ♦ మిక్కుటంబు
పనినిగొలుపుటనాయంగ ♦ మునకుఁ జాల
బలుపు గలిగియు నితరమౌ ♦ భాగములకు
బలముక్రమముగక్షీణించి ♦ బడలికగును ॥ ౩౯

గీ॥ మనసు దృఢభక్తిభావమం ♦ దునిచికాదె,
పుడమిపై నింద్రియమ్ములు ♦ పోవకుండఁ
బట్టిబహిరింద్రియములనో ♦ ర్వంగఁగంట,
బ్రహ్మమును గాంచిదైవజ్ఞ ♦ రాజులగుట ॥ ౪౦

గీ॥ ఇట్టులుండియు నతనినే ♦ నెచ్చరింప
నదియువినకయె పోద్రైవ ♦ మాయటంచు
నాస్యమెత్తియు ననుజూచి ♦ దైనసతఁడు
నెదుటనేఁబల్కరింపుట ♦ నెఱుఁగకుండె ॥ ౪౧

గీ॥ చాలతడవుల్లు స్మృతిలేని ♦ లీలఁజూచి
యూ తటాలున స్మృతివచ్చి ♦ నట్లుపలికె,
దూరమునఁదుపాకిని (బ్రేల్చఁ ♦ దోఁచిమంట
ధ్వనియునా వెన్కఁగొంతసే ♦ పటికనగును. ॥ ౪౨

గీ॥ ఉలికిపడియాతఁడంతటఁ ♦ బలుకుటయును
దోడుతనుబల్కరింపఁగఁ ♦ దోఁచకుంటి
నింతసేపట్లుగనుచున్న ♦ వింతకతన
నాకునాతని జాడ్యంబు ♦ సోఁకెననఁగ ॥ ౪౩

గీ॥ ఎలుఁగురా వానిమోముపై ♦ దృష్టినిలిపి
వానిచింతల నొకకొంత ♦ నేనునూను
చందమును దోఁపఁజేయుచు ♦ సన్న యెలుఁగు
తోనవొయ్యనఁ బలికితి ♦ వానిఁగదిసి ॥ ౪౪

గీ॥ ఎదననణఁగియుండు దుఃఖముల్ ♦ స్మృతికిఁరాఁగ
నొంటఁగూర్చుండి పలవించు ♦ చుండ, లాతి
నయ్యుఁజనవుసఁ బలికితి ♦ నయ్యసైఁపు,
మడఁగుబోని వగల్ గొంత ♦ వెడలఁ బలుక ॥ ౪౫

గీ॥ కానసడిగెడఁ జెప్పుమి ♦ కౄరణినేల
నల్లకొయ్యను గనుఁగొని ♦ పెల్లుకుంద
మొగముఁజూడంగఁబరిదేసి ♦ నగుటఁ దెలుపు
వేషమును జూడవ్యర్థంబు ♦ విన్నఁదనము, ॥ ౪౬

గీ॥ మంచికాలము గాంచిన ♦ మనుజుమాడ్కి
నున్నవాఁడవీదుస్థితి ♦ నొందితేల,
దీనిఁగననీదు వగలుబ్బు తీరుదోఁచు,
వగల దీసికి నీకునం ♦ బంధమేమి? ॥ ౪౭

గీ॥ అనుచుఁదనచేతి కొయ్యనే ♦ సంటిచూప
నతఁడు దానిపై భాగంబు ♦ నల్లఁదుడిచి
యెపైనిలుచున్న నాకంటి ♦ యెదుటనిలిపి
చక్కఁగా నందుఁగనుమంచు ♦ సంజ్ఞఁజేసె ॥ ౪౮

గీ॥ దానినేనందు కొనియందు ♦ పైనఁజెక్కి
యున్నవ్రాలను విడఁదీయ ♦ నోపకుండి
యతని చరిత్రంబు వినఁగుతూ ♦ హలముపడుచుఁ
గొయ్యనటులుంచి వానితోఁ ♦ గూరుచుంటి ॥ ౪౯

గీ॥ కూరుచుంటయు మరలనా ♦ కొయ్యఁజూపి
దానిపై వ్రాలు దెలియమి ♦ నేనుజెప్ప
వెడలిదిగజారు కన్నీరుఁ ♦ దుడిచికొనుచుఁ
గడలిగతినుబ్బు దుఃఖంబు ♦ నడఁచికొనియె ॥ ౫౦

గీ॥ కొయ్యగాదయ్యనన్వ్రాతల్ • గూర్చునదియుఁ
గొయ్యపైఁజెక్కి యున్నవ్రాల్ • గూర్చుమయ్య
యివియె నాపూర్వ వృత్తాంతంబు • స్మృతికిఁదెచ్చె
నివియెనావంతలెల్లను • నిరుమడించె ॥ ౫౧

గీ॥ పూర్వవిషయంబు దెలియమి • నేర్వవైతి
విందుఁజెక్కినవ్రాలను • నేర్పరింప,
నిదియకనుగొన్న మాత్రన • స్మృతికివచ్చి
పూర్వచరితంబు నన్నెల్ల • పొగలఁజేయు ॥ ౫౨

గీ॥ గట్టిగామూఁతగలకుండఁ • గ్రాఁగునీరు
నుబ్బనిర్బంధపడురీతిఁ • బ్రబ్బువెతలు
క్రాఁగుహృదయంబులోన • నిర్బంధపడెడు,
వెడలఁబల్కుట వెతకొంత • యడఁగునిజమె ॥ ౫౩

గీ॥ పూర్వవృత్తాంతమును జెప్పఁ • బూనునపుడు
సంకటము హెచ్చుననియెడు • శంకయున్న;
యింతకంటెను దుఃఖమెల్లెచ్చు • మఱియు
కలదుమాధుర్య మొకకొంత • కరుణయందు ॥ ౫౪

గీ॥ కనుకమున్నింటినాకతల్ • వినుతునీకు
నంతయును సావధానుఁడ • వగుచువినిన
గోడుగోడనియిట్లునేఁ • గుందఁదగిన
కారణంబున్నదో లేదో • కనుదువీవ ॥ ౫౫

గీ॥ దైవికమ్ముగ నేడునీ • దారిరాఁగ,
జలధిలోనున్న యీకొయ్య • నలలు దెచ్చి
యెదుటవైవఁగఁ జూచియు • స్మృతికివచ్చి
విడువులేనట్టి చింతలఁ • గుములుచుంటి ॥ ౫౬

గీ॥ ఎప్పుడిచ్చట వచ్చినావె • యుఁగనైతి
నెక్కడేమయ్యె నొక్కటి • యెఱుఁగనేను
కొయ్యనంటిన నాపెద్ద • గొడవదప్ప
వింతపడఁబోకు మీకొయ్య • నింతదలఁక ॥ ౫౭

గీ॥ కథవినంగను దంతయుఁ • గ్రమముగాను
దెలియు, నేరికిమును జెప్పఁ • దెలుపనైతి,
నైన నీచింత నన్నిప్పు • డాదరించి
యడుగుచుండుటఁ జెప్పెద • నడలుమాని ॥ ౫౮

గీ॥ వచ్చిగోడిచి విశ్రాంతి • యెఱుఁగకున్న
నాకుమిత్రుఁడవైనీవు • నన్నుఁజేరి
కూర్మినోదార్చమనసింత • కుదురుపడియె
దుఃఖమొకకొంత యిప్పుడు • దోఁచకుండ ॥ ౫౯

గీ॥ కథను జెప్పెద వినుమిఁక • గ్రమముగాను
బందరు పురంబునందున • వరలుచుండె
బ్రభుఁడు సద్గుణములప్రోవు • రంగరావు,
అతఁడు పెద్ద జమీందారు • లందు నొకడు ॥ ౬౦

గీ॥ వానిపెద్దలు సుగుణసం ♦ పత్తిమిగులఁ
బేరుగాంచిన వారలు ♦ వారి సంప్ర
దాయములఁదాను విడువక ♦ తనదువంశ
మునకుఁదనవారికెల్లను ♦ ఘనతదెచ్చె ॥ ౬౧

గీ॥ ధర్మబుద్ధియు న్యాయ్యంబు ♦ ధైర్యగుణము
నితనియందున మూర్తీభ ♦ వించెననుచు
నెల్లవారలుగీర్తింప ♦ నించుకైన
గర్విగాడిట్టి గుణశాలి ♦ గలఁడెధాత్రి ౬౨

గీ॥ అతని యౌదార్యమునఁ జేసి ♦ బ్రతుకుఁగాంచి
నిలిచియున్న కుటుంబముల్ ♦ గలవనేకొ
బీదబిడ్డలఁజదివించి ♦ వృత్తిఁగల్పు
ఘనుఁడు వానిని గులపతి ♦ యనఁగఁజనదె ౬౩

గీ॥ బిడ్డలను గన్నవాఁడన్న ♦ బీదవాఁడు
నన్నదానట్టి స్థితినున్న ♦ యట్టులెంచి,
వారికన్నిటఁదాఁదోడు ♦ పడుచునుండు
వారుతృప్తులై రన్నఁదాఁ ♦ బడయుఁదృప్తి ॥ ౬౪

గీ॥ భోజనార్థంబుఁగూర్చుండఁ ♦ బోడమెనేని
బీదవారల భిక్షంబు ♦ వేఁడికోలు
తనకుఁదెచ్చిన వంటకం ♦ బనిచివారి
కావలసకాని భుజియింపఁ ♦ బోవఁడతఁడు ॥ ౬౫

గీ॥ మార్గమునఁ బోవుచుండఁగ ♦ మధ్యదనకు
నగపడిన యొక్కబీదల ♦ కంతొంగితో
తనకుఁదోఁచిన మాత్రంబు ♦ ద్రవ్యమిచ్చి
గు దానము చేసి ♦ తృప్తిఁ గాంచు ॥ ౬౬

గీ॥ విద్యయందభిమానంబు ♦ పెక్కుకలదు
దానుజక్కఁగఁజదివెను ♦ గానఁజదువు
కొనిన వారలకెంతయుఁ ♦ గోర్కెలిచ్చు,
నితఁడు పండితజనకల్ప ♦ వృక్షమనఁగ ॥ ౬౭

గీ॥ ఎంతకష్టము గల్గిన ♦ నేమినష్ట
మయిన నీడండు నియమంబు ♦ నాడఁడనృత
మొరులసొత్తుల కాశింప ♦ నోడునోర్మిఁ
గనునువచ్చిన యాపద ♦ లనుసహించు ॥ ౬౮

గీ॥ ఇట్టిగుణములు గలవాఁడె ♦ 'నృపతి' యనుచు,
నతనియందలి వాత్సల్య ♦ మతిశయింపఁ
బట్టణమువారు, ప్రభువను ♦ భావమొప్ప
"నృపతి" యని రూఢిగానందు ♦ రెపుడునతని ॥ ౬౯

గీ॥ అతఁడు లోకాంతరగతుండు ♦ నయినవెనుక,
శ్లాఘ్యతమకార్యమెవ్వఁడే ♦ జరిపెనేని,
ప్రమదమున నుబ్బుమనమల ♦ రంగ "నృపతి"
బోలునితఁడని పురజను ♦ లొప్పగదు వారు ॥ ౭౦

గీ॥ వానిసద్గుణంబులనెల్లఁ • బలుక నాకుఁ
దరముగాదయ్యె, నతఁడున • న్గరుణసాఁకె,
నాకృతజ్ఞత సత్యంబు • నడఁపలేక,
యింతమాత్రముఁజెప్పితి • నింతెకాదు ॥ ౨౧

గీ॥ ఇంతెయుండియు వానికి • సంతులేని
కొఱఁత బహూకాలముండెనా • కొదువదీఱ,
'బిడ్డఁబెంచినఁగలుగును • బిడ్డ'యనెడి
నమ్మకముతోడబిడ్డగా • నన్నుఁ బెంచె ॥ ౨౨

గీ॥ అంతనాతని నమ్మిక • ననుసరించి
కాంచెనొక చిన్నిపాపను • గాంక్షదీఱ.
చిన్నపాపని గామన్నఁ • నన్నునొకటఁ
ప్రేమ మీఱఁగ నిర్వురఁ • బెంచెనయ్య ॥ ౨౩

గీ॥ అలరిశిశువును మిగులవ • త్సలత బెరయఁ
గ్రిందబెట్టినఁ బాదము • ల్గందు ననుచుఁ,
బెనుచు, బిడ్డయుఁ దనుఁగన్న • జనులకెల్ల
ముద్దుగొలుపుచు నర్మిలి • పెద్దయయ్యె ౨౪

గీ॥ ఇట్లుపెరుగుచు బాలుఁడై • దేంట్లవాఁడు
నగుటయు నతండు కొమరుని • నంపెఁబడికి
నతఁగిబాలుండు బడియందు • నయ్యవారిఁ
దనిపె నెంతయుఁ బ్రీతుఁడై • తండ్రిమెచ్చ ॥ ౨౫

గీ॥ ఎంతవ్యయమైన నోఁగాక • యితని విద్య
కేమికొఱఁతయు నుండంగ • నీయననియెఁ
జదువుసాములు సంగీత • శాస్త్రములఁ గడుఁ
గఱచె నాచిన్నిమాదొర • చిఱుత యప్పుడె॥ ౨౬

గీ॥ పాలకడలిని జంద్రుని • పగిది నన్ని
గుణములందును నుతిఁ గాంచెఁ • గొమరుతనము
నంద, తనుఁగన్నవారెల్ల • నౌరయనఁగఁ
దనదు తండ్రికి నన్నిటఁ • దగిన సుతుఁడు. ॥ ౨౭

గీ॥ ఇట్లు నానాఁటఁ గొమరుండు • వృద్ధిగాంచఁ
గనుచు నెంతయు ముదమున • మనుచునుండి
నిండువేసవి నొకనాఁడు • నెమ్మితోడ
నన్నుఁ బెనిచిన మాయయ్య • నన్నుఁ బిలిచి ॥ ౨౮

గీ॥ అనియె నెదలోన నుత్సాహ • మినుమడింపఁ
గుఱ్ఱప్రాయము నుండియు • గుఱ్ఱముల స
వారిచేయుట నాసక్తి • వరలు మిగుల
నేలయందును నట్టిదె • వేడ్క నాకు ॥ ౨౯

గీ॥ లోకపూజ్యుండు మాతండ్రి • లోకమందు
వివిధవాహనారోహణ • విద్యలందు
నిరుపమాన ప్రవీణత • నెమ్మి గలిగి
యరిది "నిండుసవా"రను బిరుదు గాంచె ౩౦

గీ॥ మనకుఁ గులవిద్య యిదియని ♦ వినతిసేసి
కఱపె నొకకొంత నీవిద్యఁ ♦ గరుణ నాకు.
నదియు మొదలుగ గుఱ్ఱాల ♦ యందు మిగుల
మనసు గలిగెను నాకును ♦ దనియనింక ॥ ౮౧

గీ॥ కాలికందూతి తీఱుగఁ ♦ గడుసవారి
చేసినాఁడను చిత్రవి ♦ చిత్రలీలఁ
జివుకు చివుకున నటనముఁ ♦ జేయుతేజిఁ
గనినఁ గాళులు జిలజిల ♦ మనెడు నింక ॥ ౮౨

గీ॥ ఎంతవెలయైన శంకింప ♦ కిచ్చి శ్రేష్ఠ
తరములైనట్టి హయములఁ ♦ గరము ప్రేమ
గొని సవారి చేయుచునుందుఁ ♦ గోర్కెమీఱ
నిప్పటికి నందురుచి వీడ ♦ దెఱుఁగుదీవ ॥ ౮౩

గీ॥ మృగయయన్న నాకాసక్తి ♦ మిగులనుండె
విసువకెప్పుడు నడవుల ♦ మసలుచుందు
వేఁటకుక్కలఁ బెక్కిఁటిఁ ♦ బెంచుచుందు,
నందు మిగిలిన యొకవేఁపిఁ ♦ గందు వింటు, ॥ ౮౪

గీ॥ ఇట్లు మృగయావినోదంబు ♦ నెపుడు దవిలి
యుండ నొకనాఁడు వేఁటకై ♦ యుగ్రవనము
మధ్య మృగములు వచ్చెడి ♦ మార్గమందుఁ
బొంచియుంటిని నడిగాక ♦ యించుకైన ॥ ౮౫

గీ॥ నిండు వేఁకటితోఁ బొట్ట • నేలకుఁజేరి
జీరుకాడుచు నుండంగ, • నీరువట్టుఁ
జేసి విస్మృతాస్యయై నీటి • యాన లేడి
పెంటి యొక్కటి వచ్చి నా • కంటఁ బడియె॥ ౮౭

గీ॥ పడుటయును వచ్చె మృగమని • పరమహర్ష
మునను నేయఁ బెట్టున నది పుడమిఁబడియె;
"నిరపరాధిని నన్నిట్లు • కరుణ లేక
తగదు చంపఁగ" ననునాఁగఁ • దన్నిఁ గొనుచు॥ ౮౭

గీ॥ పడుచు నంతట వ్రేఁకటి • భారమోర్వఁ
జాలకప్పుడు ప్రసవించెఁ • జచ్చె నదియు
నొండు తెలియక నాఁడు నా • రెండు కూన
లను గనంగనె విజ్ఞానలవముఁ గంటి॥ ౮౮

గీ॥ మనసు పరిపరివిధముల • ననఁగసాఁగె,
నగ్గలంబయ్యె జాలియు • నడఁపరాక,
దుఃఖభరమున భావంబు • తొట్రుపడఁగ,
నేమి తోఁచక పలవించి • తిట్టులనుచు॥ ౮౯

గీ॥ పటికిట్టు లీ మృగముల • నేయఁదివుర,
నేల నిష్కారణపువధ • యిట్లు చేయ,
నేమి కీడొనరించిన • దీ మృగంబు,
నెందులకు నీకళంకఁబుఁ • జెంద నాకు॥ ౯౦

గీ॥ తల్లిఁ జంపినపాపంబుఁ • దలఁగికొనఁగఁ
క్రూరమృగములనోటికిఁ • గూడుగాక
పిల్లలను దెచ్చి రక్షించి • పెంచి విడుతు
ననుచు వాని నింటను బెంచి • యడవి నిడితి॥ ౯౧

గీ॥ అదియ మొదలుగ వేఁటయం • దరుచి వొడమి
సాధు మృగముల నేయంగఁ • జనదు బుద్ధి,
సాధుబాధాకరిములెొచుఁ • జంపఁ దగిన
క్రూరమృగములమాత్రము • గొట్టఁదలఁతు॥ ౯౨

గీ॥ వాలుమెకములు పూర్వము • వోలె నిపుడు
తిఱుచు కానరాకుండుటఁ • గరవు వేఁట,
పైటఁ గాల్వెట్టి పదియేండ్లు • పరగె వేఁట
కిరువదేఁడుల కేవల • నెఱుఁగ నటిగి॥ ౯౩

గీ॥ దండనుండు నరణ్యముఁ • దుండఁ గలిగి
యిపుడు క్రూరసత్వంబులు • నేపు మిగిలి
పసుల మనుజుల బాధించి • పైరు చెఱుప
వినుడు మనమున జనియించు వేఁట యాస॥ ౯౪

గీ॥ అవుట వేఁటాడు సుఖమును • హాయము నెక్కు
సుఖము నొనగూడఁగా రేపు • సూర్యుఁడరుగ
లేచి యడవికిఁజని యుట • వేచి యుండి
క్రూరమృగముల వేఁటాడఁ • గోరు వాఁడ॥ ౯౫

గీ॥ సమ్మతంబైన నీకిది ♦ చనుద మిర్వ
రమును, మనవేఁపియునుగూడ ♦ రాకయగున,
జాడఁదీయంగఁగలదెంత ♦ గాలినైనఁ
జూపునదియును దనతోంటి ♦ చుఱుకుఁదనము ॥ ౯౬

గీ॥ నీవు నొకకొంత వేఁటాడ ♦ నేర్చినాఁడ
వయ్య నినుగూడి యిన్నాళ్లు ♦ నడఁగి యుంటి
నిపుడు పోదము వేఁటకు ♦ నిర్వురమును,
మగుడి యలనాఁటి సుఖములుఁ ♦ మనకుఁ గలుగ ॥ ౯౭

గీ॥ అనుటయును దానిఁకొంటి ♦ హర్ష మెసఁగ
వేఁట కఱిగెడిసంబ్రంబు ♦ వెల్లివొడువ
వలయు పరికరంబుల నెల్లఁ ♦ గలయఁగూర్చి
పూఁట బత్తెంబు నిమిడిక ♦ మూట గట్టి ॥ ౯౮

గీ॥ తఱచు పనిలేమి నీడాడ ♦ మఱఁగియున్న
యాయుధంబులఁ జేసితి ♦ నాయితంబు
వేఁట యుడుపులు గత్తులు ♦ వెదకి చేర్చి
కుక్క సిద్ధము సేసితిఁ ♦ గొణతఁగట్టి ॥ ౯౯

గీ॥ బయలుదేఱఁగ నేమి య ♦ భ్యంతరంబు
గలుగకుండెడు నట్టుల ♦ వలయు పనులు
నెఱిఁగి దినమంత సవరించి ♦ యినుఁడు న స్త
గిరిని జేరునప్పటి కంతఁ ♦ దరలినాము ॥ ౧౦౦

గీ॥ ఇట్లు సంతోషమమాత్మలో • వృద్ధిఁబొంద
నంత నిర్ఝరమును లేచి • యాయుధములఁ
దాల్చి సందిటఁ గొనిమూట • దట్టిగట్టి
పైనమై గుఱ్ఱములనెక్కి • పైటఁబోవ ॥ ౧౦౧

గీ॥ ఇందుబింబంబు గాన్పించె • నెదుటఁ జదల
జనులడెందము ల్రంజిల్లి • సంతసిల్ల
ధరణిపయి సుధావర్షంబు • గురియు కరణి
మృదులకాంతుల నాకాశ • మొల్లఁ గొనుచు ॥ ౧౦౨

గీ॥ చూచి గుఱ్ఱాలువేఁగ లక్ష్య • శుద్ధి కొఱకు
నల్లకాకీతమున నిష్ఠ • తెల్లగుఱు త
నంగఁ దూర్పున నీలాభ్ర • రంగమందు
శుభ్రధాముండు వెలుఁగొందె • సొంపుమిగుల॥ ౧౦౩

గీ॥ వ్యోమవారాశిఁ దరియించు • చున్నయట్టి
వెల్లయోడన నెలయొప్పె • నల్లచదలఁ
జెలఁగె మేఘముల్ హిమఖండ • శీతజలధిఁ
దేలియాడెడి తెలిమంచు • దిమ్మలనఁగ॥ ౧౦౪

గీ॥ ధరణి కవ్వలిప్రక్కను • దరణి జలధి
తూల మేకంగ నయ్యాది • తోడుతోనఁ
బైకి రేఁగినదోయన • నాకసమున
బిలుగు తెలిమబ్బు లెంతయుఁ • జెన్నువడసె ౧౦౫

గీ॥ తోఁకఁ జామరంబనురీతిఁ ♦ బైకి నెత్తి
విసరుచుండ విశాలత ♦ బెరయఁజేయు,
వివృతనాసాపుటంబుల ♦ విడుచుచుండు
'ఫట్టనుచుఁ నూర్పు' లివగల్గి ♦ వరలుఁ గాల్లు॥ ౧౧౧

గీ॥ పైకిఁ గ్రిందకు జాడించుఁ ♦ బల్మరు మెడ,
నెపుడు హేషారవంబుల ♦ నేపుసూపు,
దుడుకుకాళులు చిందులు ♦ ద్రొక్కుచుండు,
నిలువ వ్రారక నేలపై ♦ నిమిషమైన॥ ౧౧౨

గీ॥ దానితోడన నటనుండె ♦ నేను నెక్కఁ
దేజియొక్కటి యారిట్ట ♦ దేశజంబు,
కడుజవంబున కెన్నికఁ ♦ గాంచిన యది,
వాని రెంటి సమీపించి ♦ నేను నతఁడు॥ ౧౧౩

గీ॥ వెడల గ్రామమునకుఁ ద్రోవ ♦ దెలుపఁగాను
దేవుఁడనిపిన దివ్యంపు ♦ దివ్వె యనఁగ,
చందమామను గని సంత ♦ సంబుతోడ,
బయలుదేరితి మొక్కట ♦ హాయము లెక్కి॥ ౧౧౪

గీ॥ ముద్దుగుల్కెడు నమృతంపు ♦ ముద్ద యనఁగ
మిసిమిగ్రాలెడి వెన్నెల ♦ మీగడనఁగ,
బీదవారల దివ్వియ ♦ వెలుఁగుచుండ,
వేఱుదివ్విటీ గోరెడి ♦ నెట్టి గలఁడె॥ ౧౧౫

సీ॥ కొబ్బలాకుల సందులం • దొట్టినేల
యందు నాడాడవ్యాపించు • నిందుకాంతి
నడుమ నాకలనీడలు • నలుపు దాల్చె
ధరణి బియ్యము నువ్వులు • నెరపినట్లు ॥ ౧౧౬

గీ॥ తిన్నతిన్నఁగఁ జల్లని • తెమ్మెరలును
జెట్లగుబురులయందుండి • చిన్నవెలుఁగు
నొలయ బ్రమాకల నాకులు • సలసలమన
బ్రియముఁ గొల్పుచు నల్లన • వీఁచుచుండె॥ ౧౧౭

గీ॥ నేను నక్కినగుల్లంబు • దానివెనుకఁ
జనుచునుండఁగ నపుడేమి • నలుపునొయను
శంక జాగరూకత తోడ • సౌమ్యపఱచి
మిగిలి చననీక నెమ్మది • మెలఁగుచుంటి॥ ౧౧౮

గీ॥ ఉండెనూరెల్ల నిద్రించు • చున్నపోల్కిఁ
గలయనించు కేనియు శబ్ద • మొలయదెచట,
మనసు నిల్కడ చేసి స • మాధి నిష్ఠ
నణఁగియుండెడి బ్రహ్మజ్ఞ • నాత్మకరణి ॥ ౧౧౯

గీ॥ తివిరి నిశ్శబ్దమునఁగ్రాలు • తెరువులందు
హయఖురోద్ధూత నిస్వాన • మధికమగుచు
వరలె మఱియింతయై ప్రతి • ధ్వనులు మిగులఁ
గూడి హేషారవంబులు • తోడుపడఁగ ॥ ౧౨౦

గీ॥ రచ్చ వినినంతఁ జెలరేఁగి • రచ్చనున్న
కుక్కలెల్లయు గుంపులు • గూడివచ్చి
మమ్మునే యట వేఁటాడు • మాడ్కిఁ దోఁచ
మోర లాకాశమున కెత్తి • మొఱగ సాగె... ॥౧౨౧

గీ॥ ఎదురువచ్చిన కుక్కలు • నేము డాయఁ
గనినఁ దోఁకల ముడుచుచు • వెనుక కొదుగు,
కడచి యేఁగిన వెంబడిఁ • గదలు మరల
నోళ్లమాత్రము మూయవు • నోటికొవ్వె॥ ౧౨౨

గీ॥ కూడఁజనుచున్న మావేఁపి • కూడియున్న
కుక్కలన్నింటి నడగింప • నుక్కుఁ గలిగి
తోఁక వాల్పదు కూయదు • తొట్రుపడదు,
కఱవఁబోవదు నిక్కము • మొఱుగుకుక్క॥ ౧౨౩

గీ॥ ఇట్లుమావెంట నడచుచు • నేగుదెంచు
వేపి తండము మముఁగొంత • వెంబడించి
యొక్కటొక్కటిగా నిల్చె • నడిగె రచ్చ
వీడు నెమ్మది వహియించె • వెనుక నుండి॥ ౧౨౪

గీ॥ ధ్యాన తత్పరుఁడై యుండ • దటుకు మనుచు
చింత యొక్కటి యుదయింపఁ • జిత్తము పరి
పరివిధములుగ భ్రమియించుఁ, • బ్రాజ్ఞుఁడగుచు
మనసు నిలగట్టి నెమ్మది • మరలుపనగు॥ ౧౨౫

# ఆశ్వాసము. ౧



రంగరావు బందరుపుర నివాసి. చాలయోగ్యుఁడు; మిక్కిలి దయాళువు. వదాన్యుఁడు, పురజనుల మెప్పువడసిన వాఁడు. సిరిసందలన్నియున్నఁగాని సంతులేదన్నచింత తీరనిది గానుండెను. కొంత కొఱంతతీఱునని బాలయ్య యను బాలుని గారాబముతోఁ బెంచెను. అతఁడు సుగుణవంతుండై ప్రీతి విశ్వాసపాత్రుఁడై పెరుఁగుచుండెను. అంతఁగొంతకాలము నకు సంతులేదన్నకొఱంత తీఱఁగాఁ గుమారుఁడు కలిగెను. ఆ కుమారుఁడు రాముఁడుచిన్ననాఁటనుండియుఁ జదువుసాములను జక్కఁగా నభ్యసించి సుగుణవంతుఁడై యందఱ ప్రీతివడసి తండ్రికిఁదగిన బిడ్డయనిపించుకొనెను.

రంగారావుకు గుఱ్ఱపు సవారియందును షికారునందును మిక్కిలిశ్రద్ధ. ఇట్లుండఁగా సమీపమందున్న అరణ్యములో నొక చిఱుతగండుచేరి జనులకును బశువులకును బాధగలిగించు చున్నదని వార్తవచ్చినందున రంగారావు వేఁటకుఁబోవ నిశ్చ యించుకొనెను. అడవిలోఁ దన మంచెమాటుపై వేచి యుండఁగాఁ జిఱుతవచ్చినది. రంగరావుకాల్చెను. కాని పులి పెట్టునఁబడక గాయపడి మంచెమాటును దృష్టించి మంచెపై

ఱెగసినది. వెంటనే మంచెమీఁద రంగరావుతోఁ గూడనుండిన బాలయ్య పులినొసటికిఁ బట్టి యంటించెను. పులి పెట్లునఁబడినది. తుపాకుల దెబ్బలు వినరాఁగానే వేఁటరులందఱు వచ్చి మంచె మాఁటుదగ్గఱఁ జేరిరి. రంగరావుకి గాయమైనది తెలియఁగానే అందఱకు గుండెలుఝల్లుమనెను. రంగరావు స్వయముగాఁ బౌరు లందఱకుఁ బ్రేమపాత్రుఁడగుటయేగాక యిప్పుడతఁడు వారలకు మేలుచేయ వచ్చి తానుబెద్దకీడు ననుభవించెను. అది జనులకు మఱింత సంతాపకరమైనది. అంతఁగొంత సేపటికి బాలయ్య మనసు దిటవుచేసికొని గాయమును గడిగి తాత్కాలికపుఁజికిత్స చేసి కట్టుగట్టెను. అందఱును జాలఖిన్నులై యూరుఁజేరిరి.

ఊరుఁజేరఁగానే రంగరావు బనారసులోఁ జదువుకొను చుండు తనకుమారుని రామరావునురమ్మని తంతియిచ్చెను. ఇంతలోవైద్యుఁడువచ్చి కట్టువిప్పి చూచి చికిత్సచేయుచు గాయ మేమంత పెద్దదికాదు గాయము పులియకుండ మూఁడునాళ్లు కాపాడికొనినంతటఁబ్రమాదమేమి లేకుండవచ్చుననెను. అది యందఱకుఁగొంతయూఱటగా నుండెను.

రామరావురాఁగానే రంగరావు ఆయనను ముందటఁ గూర్చుండఁబెట్టుకొని యిట్లుచెప్పెను. గాయమేమంత పెద్దది గాదు. భయపడవలసిన దేమిలేదుకాని ఒకవేళ దైవికముగా గాయము పులిసినంతట విస్మృతివచ్చును. అప్పుడు నామనసు లోనున్న దానిని జెప్పుట కవకాశము గలుగదుగాన సత్వరముగా

నిన్ను రప్పించితిని. నీవేమి చింతపెట్టుకొన నక్కఱలేదు. నీవు ధైర్యశాలివి. నాకుఁ దెలియును. అన్ని సుఖములను అనుభవించినాను. జనులందఱ ప్రీతికిఁ బాత్రుఁడనైనాను. బిడ్డలు లేరన్న కొఱఁతను నీవు పుట్టి తీర్చినావు. గుణవంతుఁడవై నాకు దృష్టి కలిగించినావు. ఇఁక నేఁగోరవలసినదేమి లేదు. ఒకటి మాత్రము చెప్పఁదలఁచినాను. పెద్దవాఁడవై పెండ్లికెదిగినావు. ఆవిషయమై ఆలోచింపఁదరుణము. చిన్ననాఁటినుండి ముద్దుగా ననుకొనుచుండినట్లు నీమఱఁదలు సీతను పెండ్లాడు విషయమాలోచింపఁదగి యున్నది. పిల్ల మిక్కిలి గుణవతి. కలిగిన యింటఁబుట్టినానన్న గర్వమేమాత్రము లేదు. ఈర్ష్యాసూయాలోభాధిగర్వగుణము లేనిలేవు. కడు శాంతురాలు. శాంతము తెలివితక్కువకొక సూచనయని కొందఱ దురభిప్రాయము. అట్లుకాదు. ఈమె తెలివిగలది. వివేకముగలది. చిన్ననాటి నుండి మనకుఁ దెలిసినదే. అయిన సీతనే పెండ్లాడవలసినదని నిన్ను నిర్బంధింపఁగలఁచిన వాఁడనుగాను. అట్లు నిర్బంధించుట యోగ్యముకాదు. అవివేకము. నీవు నీపెండ్లివిషయమై విచారించునపుడు సీతవిషయముగూడ నందునాలోచింప వలెననుటేకాని మఱియితర మేమికాదు.

ఇంకొకటి నేఁజెప్పఁదలచినది మనబాలయ్య విషయము. ఇతనిని జిన్నప్పటినుండి నీతో సమముగ గారాబముతోఁ బెంచినాను. నాకునతని యందుఁ గలిగియున్న ప్రేమకుఁ దగిన

విశ్వాసముగలవాఁడై నాఁడు. మ[illegible]డుమేలులు తెలిసిగానెంచు వాఁడు. ప్రాణమునకుఁ బ్రాణమిచ్చువాఁడు. ఇతని నెన్నఁటికిని జేయివిడువవలదు. ఇఁకనేఁజెప్పవలసిన దేమియులేదు. దైవము నిన్ను రక్షించుఁగాక.

రామరావు కొంతకాలము బనారసులోఁ జదివిన తరువాత అక్కడనుండి సీమకుఁబోయి అక్కడఁబూర్తిగాఁ జదివిరావలెనను నుద్దేశముగలవాఁడై తనమేనమామ కేశవరావు అనుమతినిబొంది కావలసిన యేర్పాటులన్నియుఁ జేసికొనెను. తనతోడఁ దోడుగా బాలయ్య గూడఁబోవునట్లు నిర్ణయించుకొనిరి. నౌకాప్రయాణమునకుఁ గావలసిన సామగ్రినంతయు సంతరించుకొని ఓడ బయలుదేఱవలసిన నిర్ణీతకాలముకన్న రెండుగంటలు ముందుగానే యోడలోనికెక్కి వారికేర్పాటయి యుండిన జంటగదిలోఁ బ్రవేశించి సామానుల నన్నిటిని వాని వానిచోటులఁజక్కఁగా నిమిడిచి బైటవేడుక చూచుటకు ఓడ పై మిద్దెమీఁదనెక్కిరి. ఓడకై వచ్చువారును, ఓడను విడచి పోవువారును, గుంపులు గుంపులుగాఁ గూడి పుట్టపిగిలిన యీసుళ్లవలె పడవమీఁద దోనెలమీఁదఁదిరుగులాడుచుండగా దూరమున నున్న పట్టణములోని మేడలు చాళ్లుగట్టి మితిమీఱి పెరిగిన చెదలుపుట్టలయట్లు కాన్పించుచుండెను.

నావబయలుదేఱుకాలము రాఁగానే లంగరెత్తిబయలు దేఱుసంకేతములఁజూపిరి. తిన్నగ నోడబయలుదేఱ ఒడ్డుననున్న

యింక్కన్నియు వెనుకకుఁ బరువెత్త నారంభించి నవి. ఓడలోఁగదలిక హెచ్చాయెను. ముందుకుఁ ద్రోసినప్పుడును. దానిని సవరించుకొనునప్పటికి వెనుకకుఁ ద్రోసినప్పుడును. వాడుకలేని రామరావు బాలయ్యలకు ఓడమిద్దె మీఁదనిలుచు కొనుటకే సాధ్యముకాక కూర్చుచుండిరి. అప్పుడు బాలయ్య తనచొక్కా జేబులోనున్న కత్తితో ఓడపక్కను నమర్చియుండిన కైప్రాపుకొయ్య మీఁదనేమోగిఁతలను జెక్కి రామన్నాయిది చూడు నేనుజేసిన పనియనిచూపెను. రామయ్యచూచి ఏమిటి బా. రా" దచ్చి" కాదా, యనియడుగఁగా అది "బాలయ్య "రామయ్య" యనియర్థము. మనమింకెప్పుడుగాని ఈయోడ లోనికి వచ్చునప్పుడు తటస్థించునెడ ఇదిమనకానవాలగు ననఁగా, మనము మరల నీయోడలోనికేల వత్తుమనినవ్వెను. అప్పుడే సూర్యాస్తమయమగు చుండినది. చీకటియంతయు నావరించు టకుమునుపే విద్యుద్దీపములు వెలిఁగించిరి. ఎటు చూచినను గ్రీనీడలేనిదీపములే, అంతయుఁ దేజోమయమాయెను. వారు లేచిమొకని నొకడాధారముగ బట్టుకొనుచుఁ దిన్నఁగఁ దమ గదిఁజేరిరి. ఓడ కదలికచేత వారికడుపులో వికారింప నారం భించినది. ఆహారద్వేషము మిక్కిలియైనది. వారిరువురకే కాక ఓడలోని వారికందఱకు నీబాధకలిగినది. మూఁడునాళ్ళుబాధించి ఆవలక్రమముగా నెమ్మదించినది.

ఇట్లుండగా నొకనాఁటి యుదయము "వాయుభార సూచనయంత్రము" (బెరామిటర్)ను గమనించు చుండునతఁడు చూచి దూరమున పెద్దతుపాను కలుగుచున్నదనియు నదిమన వైపుననే వేగముగ వచ్చుచున్నదనియు అపాయవార్త ప్రకటించెను. ఇంతలోనఁ దుపానుతోడ ఒకపెద్ద ఉప్పెనయునుకూడి విపరీతపువేగముతోఁ బరువెత్తుచున్నదని హెచ్చరిక సంకేతములును వచ్చినవి. ఓడలోఁ బెద్దగలబయైనది. ఎత్తట్టు చూచినను ఆర్తధ్వనులు నిండియుండెను. ఓడలోస్థితి మిక్కిలి ఘోరముగను సంతాపకరముగను నుండెను. జనులు దిక్కుతోఁపక వెఱ్ఱి పట్టినవారివలెఁ బరుగెత్తు చుండిరి. తుదకు ఉసురుపడవను (లైఫ్‌బోట్) నీటిలోనికి దింపుటకుఁగూడ వ్యవధిలేకపోయెను. భయంకరమైన పెద్దరొదపుట్టెను. దూరమునందే ఉప్పెన కానిపించెను. ఏనికయెత్తును జూపుమేర వెడలుపును గలిగి నడగొండ చాలు ఊపిరివచ్చి పరుగెత్తుచున్నట్లుండెను. అపాయస్థితిని దూరముశ్రవణయంత్రముల మీఁదనలు దెసలకుఁ బంపిరి గాని ఎవరునువిని సకాలమున సహాయమువచ్చుటకు వీలులేదాయెను. ఉప్పెన భీకరవేగముతోవచ్చి ఓడను ఢీకొనియెను. నూరుఫిరంగి గుండ్లు ఒక్కపెట్టున ముట్టినట్లుండెను. నీరు చిమ్మనగ్రోవితోఁ జిమ్మినట్లు వెండితేకుల చెట్టువలె పైకెగసెను. ఓడదెబ్బతాఁకిన ప్రక్కలోత్తిపోయెను. ఓడప్రక్కకు దారలి తలముందుగ మున్నీట మునిఁగెను. నానావిధములుగ నమర్చియుండిన పలకలు,

కొయ్యలు, తలుపులు, మొదలైనవన్నియుఁ గిళ్ళువీడి విఱిగి చిందఱ వందఱగఁ దేలియాడుచుండెను. ఓడలోని జనులు కొందఱు పైటకు రాలేక చిక్కుకొని యోడతోడ మునిఁగి పోయిరి. పెక్కండ్రు పలకలు కొయ్యలు పట్టుకొని మునఁగ కుండ పెనఁగులాడుచుండిరి. అప్పటికి ఉప్పెనయుద్ధతియడఁగినది. అప్పుడు లండనుకుఁబోవుచుండిన యొకపెద్దనావ యీయోడ యంపిన యార్తసంకేతమును గనుపెట్టి యీయోడనుఁగాపాడు టకుఁ బరుగు పరుగునవచ్చెను. వచ్చునప్పటికే యందఱు మునిఁగి పోయిరి. రామరావు మాత్రము తేలియాడుచుండిన యొకపెద్ద కంబము కొయ్యయాధారము దొరికినందున దానిని బట్టుకొని మునిఁగిపోకుండఁ దేలుచుండెను. ఓడలోనివారతనిని దమయోడ లోనికిఁదీసికొని స్మృతితప్పియున్న యతని చొక్కాజేబులోని కాకితములవలన రామరావు గొప్పకుటుంబమునకుఁ జేరినవాఁడ నియు సీమలోఁ జదువఁ బోవుచున్నాఁడనియుఁ దెలిసికొనిరి. అతనికిఁ దత్కాలోచిత చికిత్సచేసి స్మృతివచ్చి కొంతరెక్కొనిన తరువాత వైద్యశాలలోఁజేర్చి ఆయనకు లండనులో నన్ని యేర్పాటులు చేయుచుండిన వర్తకసంఘమువారికి నెఱుక పఱచిరి. రామరావును ద్వరలో యథాప్రకారమారోగ్యము గలవాఁడయి వైద్యశాలను విడిచి లండను సర్వకళాశాలలోఁ జేరి విద్యాభ్యాసము నారంభించెను.

ఉప్పెన తాకునకుఁగట్టులన్నియు నూడి సముద్రములో బోరగిలఁబడిన యుసురుదోనెను బాలయ్యయును, నింకనలువురు

పట్టుకొనిరిగాని దానినిసరిగాఁద్రిప్పఁజాలరైరి. ఇట్లుప్రయత్నము చేయుచుఁదేలుచుండగా మదరాసుకుఁబోవుచుండిన యొకచిన్న నావవారు వారియుపాయసంజ్ఞను వినివచ్చి బాలయ్యాను దక్కిన నలువురిని దమయోడలోఁదీసికొనిపోయి మదరాసు వైద్య శాలలోఁజేర్చిరి. అక్కడదేహములను బాగుచేసికొని వారు వార్లియూర్లకుఁబోయిరిగాని బాలయ్య మాత్రము తనయూరికిఁ బోనొల్లక "నాచిన్నిరామన్న యట్లుసముద్రములో మునిఁగి పోయిన తరువాత నేనుబందరు కేమొగముతోఁ బోఁగలను. లక్ష్మమ్మనెట్లుచూతును. చిన్నమ్మకేమి చెప్పగలను. సీతమ్మ నేమని యోదార్తును. నేనుబందరుకుఁబోఁజాలను. ఇక్కడనే నాయాయుశ్శేషమును ఎట్లనో యొకట్లు గడపెద" నని నిశ్చ యించుకొనెను.

శంకరయ్య యను నొక మదరాసులోని పెద్దమను ష్యుఁడు బాలయ్య వైద్యశాలలోనుండఁగా నతనిని జూచు నట్లు తటస్థించెను. అతనిని జూడఁగానే యతఁడేదో గొప్ప విపత్తు ననుభవించు చున్నాఁడని గ్రహించి అతని యందు మిక్కిలి జాలిగొన్నవాఁడై బాలయ్య మనసుకు వెగటు కలుగ కుండ మిగుల నెనరుగల మాటలతో నతఁడు దన తోడనుండ నొడంబఱిచి బాలయ్యాను దనయింటికి వెంటఁబెట్టుకొనిపోయి, అధికమైన యాదరముతోఁ బోషించు చుండెను. బాలయ్యయు నిజస్వభావానుసారముగా శంకరయ్యయెడ నపరిమితమగు ప్రీతి

విశ్వాసములును గృతజ్ఞతయును గలిగి ఆయనకుఁ బూలు పత్రియు మొదలగు పూజాద్రవ్యములఁ దెచ్చుచుఁ బూజలోఁ బాలు పడుచుఁ గాలమేదోయొకవిధముగ గడపుచు అప్పుడపుడు చింత మెండై నప్పుడు సముద్రముకడకుఁబోయి యొక్కడ నొంట రిగఁ గూరుచుండి తనవెతలనన్నియుఁ దలపోసికొని కొంత దుఃఖోపశమనము చేసికొని యింటికి వచ్చువాఁడు. శంకరయ్య యును నతని వెతలగుఱించి విచారించిన నది వాని మనసు నొప్పించునేమోయని తప్పించువాఁడు.

రామరావు సీమలో విద్యాభ్యాసము పూర్తి చేసి పరీక్ష లలో నుత్తముఁడుగ నుత్తీర్ణుఁడై బాదరువచ్చిచేరి కొంతకాల మైన తరువాతఁ జెన్నపురిలోఁ దననిహితులతో మాటలాడ వలసినట్లు తటస్థించినందునఁ జెన్నపట్టణమునకు వచ్చెను. అప్పు డొకనాఁడు సముద్రపుటొడ్డున నొంటరి విహారించుచుండఁగా నెదుట నొకవ్యక్తి అగపడెను. అదియేమయినది తెలియక తెలిసికొనఁగోరి సమీపింపఁగా నది మనుష్యుడేయని తెలిసెను. ఒక్క పెద్దగుడ్డతోఁ గాలుసేతులుకూడఁ దెలియకుండ నొడలం తయుఁ గప్పికొని తలమోఁకాళ్లమీఁద మోటించుకొని మితి లేని చింతతో నిమగ్నుఁడై నిశ్చేష్టితుఁడై యుండుటచేత మనుష్యుఁడని గుర్తించుటే కష్టమాయెను. ఎఱిఁగిన తరువాత నతని సందర్భమేమో తెలిసికొనవలెనని రామరావుకుఁ గుతూ హలము గలిగి యతనిని నెమ్మదిగ నెచ్చరించెను. కొంతసేపటి

వఱకు గమనమే లేకుండ రామరావు మొగమునట్టె చూచుచుండి తటాలున స్మృతివచ్చినట్లు ఉలికిపడి రామరావును గమనించెను. అప్పుడు రామరావు అతనితో "నీసందర్భముచూడఁగా నీ కేదో గొప్పయాపద ననుభవించి దుఃఖాక్రాంతుఁడవై యున్నట్లు తోఁచుచున్నది. దుఃఖము మిక్కిలి మెండైనప్పుడు సానుభూతి గలవారి యెదుట వెడలఁబోసిననది కొంతయడఁగునుగాన, నిన్ను నడుగు చున్నానుజెప్పు" మనెను. అంతనతఁడు తనకథను మొదటినుండి చెప్పఁదొడఁగెను. తనముందున్న కొయ్యనుదాని పైనఁజెక్కియున్న "బా" "రా" అనునక్షరములను జూపి అవిమేము మంచికాలములో నుండినప్పుడు నేనును రామరావును ఓడపైనము చేయుచుండఁగా విలాసార్థము ఆయోడప్రక్కఁజెక్కి మీఁద మాయిరువురిపేర్లు బాలయ్య రామరావు అనుటకు "బా రా" అని కత్తితోఁజెక్కితిని. ఇఁకనెప్పుడైననాయోడఁగో మేమెక్కునట్లు తటస్థించునంతట ఆ యక్షరములను బట్టి జరిగిన దంతయు జ్ఞాపకమునకుఁదెచ్చును గదాయనుకొంటిని. నేనొకటి తలఁచిన దైవమింకొకటి తలంచెను. ఆయోడమునిఁగి పోవుటయు అందులో రామన్నను గోల్పోయి నేనుమాత్రము బ్రదికి దుఃఖించుచుండుటయుఁదటస్థించినది. ఆకొయ్యను దానిలోఁజెక్కి యున్న యక్షరములను జూడఁగానే అదంతయు జ్ఞాపకమునకు వచ్చి దుఃఖించుచుంటిని.

ఆరంభములోనే యిదితనకథయని రామరావు తెలిసికొనెను గానితనకన్నులయెదుట సముద్రములో మునిగిపోయిన బాలయ్య యెట్లుబ్రదికివచ్చెనని సంశయము రామరావునకుఁ గలిగినది. బాలయ్యకథాధోరణి కష్టపడ నిష్టపడక కడవఱకు నతనినోటనే చెప్పనిచ్చెను. వారిరువురు సీమకుఁ బ్రయాణమై పోవుచుండఁగా సముద్రపు టుప్పెనలో నాయోడపగిలి పోయి మునిఁగిపోయిన ప్పట్టునకు వచ్చునప్పటికి రామరావు ఆఁపుకొనలేక అతనిప్రక్కను మోఁకాళ్లపై బ్రవాలి అతనిని గౌగిలించుకొని "అన్నా బాలయ్యా నేనే నీరామన్నను నీవేనా బాలయ్యవు. మనమిరువురము ఒకనినొకఁడు సముద్రములో మునిగి పోయి నట్లు భావించి దుఃఖించితిమి. మనలో నొకఁడును జనిపోలేదు. ఇద్దఱమును బ్రదికియేయున్నాము. ఇది కేవలము దైవఘటన. మన మెఱుఁగఁజాలము. ఎప్పుడేదికలిగిన నప్పటికి దానినెక్కువగాఁ దలంతుము. దైవకృపవలన మనమిద్దఱమును బ్రదికి సురక్షితముగా నున్నా" మనిచెప్పి కొదవ కథలను జెప్పికొనుచు నుభయులునులేచి దైవమునకు మిక్కిలి భక్తిపూర్వకముగా మ్రొక్కులిడి కష్టానంతర సుఖమాధుర్యము ననుభవించుచు శంకరయ్య యింటికిఁ బోయి యాయనతో నంతయుఁ జెప్పిరి. శంకరయ్యయును జాలసంతోషించెనుగాని బాలయ్యను బంపివేయవలసి వచ్చినందులకు మిగుల వ్యాకులపడెను. ఆపత్కాలమందుఁ గూడినమైత్రి బహుబలీయముగదా;

# ఆశ్వాసము ౨

కాలయ్య ఓడతోడ సముద్రములో మునిఁగి పోయినాఁడని అందఱు నిర్ణయించుకొనియుండిరి. అట్టియెడ నతఁడు తిరిగి బ్రతికివచ్చి తనవారందఱతోఁ గలసికొనుటవలన నెంతో సంతోషముగలిగి మిక్కిలి యుల్లాసముతో నుండిరి. కాని మూఁదున్న మనస్థ్సపండుగ తెలియదు. రామన్న మాప్పు నెఱుఁగరైరి.

కేశవరావుకు జ్యోతిషమునందుఁ గడుఁబ్రీతి. ఆశాస్త్రము నందుఁ గొంత ప్రవేశమును గలదు. అప్పుడప్పుడు క్రొత్తజాతకములను దీసికొనిచూచి గణించుచుండువాఁడు.

ఒకనాఁడు ఆయన తనగదిలో గవాక్షముమందల నొక పెద్దకురిచీమీఁద సుఖాసీనుఁడై తన ప్రక్కనున్న పీటమీఁది కాకితములోనుండి ఒకజాతకమునెత్తి యేమో గణించుచుండెను. అప్పుడు శివుఁడువచ్చి "రాజమహేంద్రవరములో నుండు కృష్ణరావు తమతో మాటలాడఁగాను బంపిన సుబ్బయ్యయను నతఁడు వచ్చినాఁడు. ముంగిటిలోఁ గూరుచుండఁబెట్టి వచ్చినాను సెలవైనంతటఁ బిలుచుకొని. వచ్చెద" నని చెప్పెను. కేశవరావు అతనిని బిలుచుకొని రమ్మని చెప్పఁగా శివుఁడు పోయి సుబ్బయ్యను బిలుచుకొనివచ్చెను.

సుబ్బయ్య రాఁగానే కేశవరావు "ఏమయ్యా మీరు వచ్చినపని" యని ప్రశ్నించెను. "అయ్యా, నేను రాజమహేంద్రవరములో నుండు కృష్ణరావు పంపఁగా వచ్చితిని. మీరును వారిపేరును వినియుండవచ్చును. వారచ్చట మిగులఁ ప్రసిద్ధులు. రాజమహేంద్రవరములో మిక్కిలిపేరు ప్రఖ్యాతి కల కుటుంబమువారు. వారితండ్రి యనంతరము కృష్ణరావే కుటుంబాధ్యక్షులై యున్నారు. వారికి అన్నదమ్ములుగాని, అక్కసెల్లెండ్రుగాని ఎవ్వరు లేరు. వారికి సంవత్సరమునకు ౫౦౦౦౦ ఏఁబదివేలు రూపాయలు రాఁగల పట్టాభూములున్నవి. రాజమహేంద్రవరములో అనేకములు ఇండ్లు, బంగళాలు, తోఁటలు నున్నవి. నేను పెండ్లిప్రస్తావము చేయవచ్చితిని గాన వారిస్థితిగతులు తమకుఁ గొంత వివరింపనవసరమైనది" అని చెప్పఁగాఁ గేశవరావు "అయ్యా నాకున్నది ఒక్కకుమారిత. ఆమెకుసంబంధము నిర్ణయమై యున్నది. కనుక నిప్పుడీప్రస్తావమున కవకాశమే లేదే" యనెను. అందులకు సుబ్బయ్య "నామనవి కడవఱకుఁ చిత్తగించి ఆవల తమ చిత్తానుసారము సెలవీయదగును." అని ప్రార్థించెను. "అట్లయినఁ గానిమ్ము. చెప్పు" మనఁగా సుబ్బయ్య యిట్లు చెప్పఁదొడఁగెను. "ఇంట నొంటరిగానుండుటచేతఁ ద్వరగాఁ బెండ్లి చేసికొనఁ దలఁపుగలిగి సరియైన సంబంధముకై విచారించుచుండఁగాఁ దమసంగతి తెలిసినది. తమరు చాల గొప్పకుటుంబమునకుఁ జేరినవారనియు,

మిక్కిలియోగ్యులును బూజ్యులుననియుఁ దమ కుటుంబమును సంబంధ బాంధవ్యములచేతఁ గలసికొనుట యెంతయుఁ గోరఁ దగినదనియు నేర్పడినది. ఇఁకఁ దమకొక కూతురు కలదనియు ఆమె సకల సద్గుణరాశియనియుఁ బెండ్లికి ఈడువచ్చిన దనియుఁ గూడ నెఱింగితిని. కాబట్టి వివాహ విషయ ప్రచారముఁ జేయుటకిది తగినకాలమని భావించితి" ననఁగానే కేశవరావు "వివాహ విషయమును గుఱించిన ప్రచారమునకే సందర్భము లేదనియు నాకుమారితను నామేనల్లునకిచ్చి పెండ్లి చేయున ట్లుప్పటి నుండియో నిర్ణయమయి యున్నదనియు నేను మొదలనే చెప్పి యున్నానుగదా. ఇఁక నిపుడా ప్రచారమేల" యనెను. "అయినను నామనవిని ఆవిషయములో నేనుజెప్పఁబోవుదానిని విసువులేక సావధానముగఁ జిత్తగించి అది న్యాయవిరుద్ధముగాఁ గాని ధర్మవిరుద్ధముగాఁగాని యున్నదాయని యాలోచింపఁ దగును. "యుక్తం యుక్తం వచోగ్రాహ్యం బాలాదపి శుకా దపి" అని యున్నదిగానఁ జెప్పఁబోవు చున్నానేకాని వేఱు గాదు. తమరు పెద్దలు. అన్నియుఁ దెలిసినవారు. తమకు తెలి యని క్రొత్తవిషయ మొక్కటి తమకుఁ దెలుపఁగలనని తలఁచి పలుకుటగాదు. కనుక క్షమించి వినవేఁడెద. అన్ని విషయ ములలోను రెండుపక్షములు తప్పకుండును. అయిన నొక్కొక్క తఱి కొన్ని సన్నివేశములవలన ఒకపక్ష మతిబలిష్ఠమగుట చేతనో లేక తక్కినపక్ష మతి దుర్బలమగుట వలననో మనసు కది తట్టనే తట్టదు. అట్టి సందర్భములలో బలిష్ఠమగు పక్ష

మును బట్టియే కార్యములు జరుగుచుండును. వివాహ విచా
రము సామాన్య విషయముకాదు. చాల గొప్పది. దాని
గుణము ఆమరణాంతము వ్యాపించునది. కనుకఁ జులకనగ
నిర్ణయింపఁ దగదు. బిడ్డలు తలిదండ్రులకు వారి యిష్టాను
సారము వినియోగింపఁ దగిన స్వత్వములుగావు. దేవుఁడు
వాండ్రకు స్వతంత్రత కలుగువఱకు సంరక్షణార్థము తమయొద్ద
నప్పగించిన మానవవ్యక్తులు. కాఁబట్టి కూతురి క్షేమమును
సదా మనసు నందుంచుకొని తక్కిన వేవెట్లున్నను దానికి
న్యూనత రాకుండఁ గాపాడవలసినది తండ్రికివిధి. తప్పించుకొన
లేని ధర్మము. కనుక బిడ్డ వివాహవిషయము విచారించు నపు
డివి యన్నియుఁ జక్కఁగ నాలోచింపవలెను. వివాహమనఁగా
సామాన్య కార్యముగాదు. దాని శుభాశుభగుణములను గల
కాలము కడవఱకు ననుభవింపవలసినది బిడ్డ. బిడ్డకు సంబం
ధము నిర్ణయించు నప్పుడు ఆమె క్షేమమునకు భంగము కలుగ
కుండఁ బురోభివృద్ధి కేవిధమైన అడ్డవాటు కలిగించునది గాకుండ
నుండవలెను. బిడ్డక్షేమము ప్రధానముగాని యితరుల సౌకర్య
ములు ముఖ్యములుగావు. పెద్దలొక సంబంధమును నిర్ణయించు
కొని యుండఁగా అంతకన్న మేలయిన మఱియొక సంబంధము
తటస్థించినంతటఁ దప్పక రెండింటిలో మేలైనదానినే యంగీక
రింపవలయునుగాని మాటతప్పిపోవుట యెట్లని తక్కువ సంబంధ
మునకుఁ బోవుట బిడ్డ శ్రేయస్సును జూచుటగాదు. మాట

తప్పిపోకుండఁ గాపాడికొను మాటిచ్చిన పెద్దల సౌకర్యమును జూచుటయే యగును. ఇదంతయుఁ జక్కఁగా నాలోచించిన మాటిచ్చుట యను ప్రచారమునకే యెడములేదు. వచ్చిన సంబంధములలో నేది యుత్తమమున దనుటయే గమనింప వలసినది

ఇఁక నిపుడు వచ్చియుండు సంబంధము విషయములోఁ గృష్ణరావు స్థితిగతులను గొంతఁ జెప్పియున్నాను. ఈయన ౨౨ ఏండ్ల వయసువాఁడు. చక్కనివాఁడు. చాల నేర్పుకాడు. నలుగురిలో మాటలాడ నేర్చినవాఁడు. నలుగురిలోఁ దిరుగ నెఱిఁగినవాఁడు. ద్రవ్యమును వ్యర్థముగ వ్యయము చేయఁడు. ఆస్తి తనచేతికి వచ్చిన తరువాత దానిని జాల నూర్జిత పఱచి నాఁడు. ఇంత గొప్పసంబంధము దొరకుట దుస్తరము. ఇంత ఆస్తికలవారీప్రక్క మఱెవ్వరు లేరు. క్రొత్తయె "ధనమూల మిదంజగత్తు" సం॥. ధనమున్న నన్ని సౌకర్యములను సంపా దించు కొనవచ్చును. ధనముతో నన్నికార్యములను సాధించు కొనవచ్చును. ఈ లోకమున సామాన్యముగ ద్రవ్యముతో సంపాదింపఁ జాలనిదిలేదు. "అన్ని గుణములు గాంచన మాశ్రయించు." అనేకులు ధనికునియొద్దఁ జేరుదురు. వారితో ననేకులు గుణవంతులుందురు. వారి సాంగత్యమువలన మేలు సంపాదింప వచ్చును. ఇన్ని యవకాశములు గల యీసంబంధ ముతో సమానమైన సంబంధము మఱియొకటి దొరకుట దుర్ఘ

టము. కాఁబట్టి యన్నియుఁ జక్కఁగ నాలోచింపకుండఁ జాల కనగ విడిచిపెట్టుట యుక్తముగాదని తెలుపుటకుగా నింతదూ రము చెప్పినాను. తమరు నేఁజెప్పినదంతయు సాంతముగ విని నారు. శాంతముగ గమనించినారు. ఇఁక నేఁజెప్పిన దానిలో నేదైన నయుక్తమైనదిగాని, యసందర్భమైనదిగాని యున్నంతట నన్ను క్షమించి తెలుపఁ బ్రార్థించుచున్నాను" అని సుబ్బయ్య కేశవరావు ప్రత్యుత్తరము నిరీక్షించుచు వారి మొగమును జూచు చుండెను. అప్పుడు కేశవరావు సుబ్బయ్య ముఖము నట్లు గమనించిచూచి "సుబ్బయ్యా! నీమాటలలో నేమి యయుక్తమైనదిగాని, యసందర్భమైనదిగాని లేదు. విశిష్టమునకు మీవాదము గమనింపఁ దగియున్నది. చక్కఁగ గమనించి నాను. మరల మరల నిదానముగ నాలోచించెదను. తుర్య పడఁదగిన విషయము గాదు." అని సుబ్బయ్య మొగమును జూచెను. అప్పుడు సుబ్బయ్య యుత్సాహముతో "అట్లయిన జిత్తము. నాసందేశము నెఱవేఱఁగలదని ధైర్యముగా నుండఁ గలను. కృష్ణరావుగారి జాతకమిదో చిత్తగింపుఁడు. తమరు శాస్త్రజ్ఞులు, ప్రాజ్ఞులు గాన గుణమును గనిపట్టఁగలరు" కేశవ రావు "తొందరపడను."

సుబ్బయ్య "కృష్ణరావు తానువచ్చి తమను దర్శింప వలెనని యభిలాషయున్నదని తమతో మనవిచేయమన్నాడు." కేశవరావు "ఆహా, దానికభ్యంతరమేమి? వచ్చి నన్నుఁజూడ

వచ్చును. నాకును కృష్ణరావును జూడవలెనన్న కోరిక యున్నది." సుబ్బయ్య "ఆయనను ఎప్పుడు రమ్మని సెలవు." కేశవరావు "పై బుధవారమునాడు రావచ్చును. ఈలోఁగా నేను ఈ సంబంధముల విషయముగూడఁ జక్కఁగా నాలోచించెదను." సుబ్బయ్య "సెలవా?" కేశవరావు "మంచిది."

సుబ్బయ్య సెలవుదీసికొని పోయినాఁడుగాని కేశవరావు మనసుకు వికలము గలిగినది. సుబ్బయ్య చెప్పినదంతయు విను నప్పటికి ఆయనమాటలు కేశవరావుకు నిజముగానే తోఁచినది. ఆలోచింప నాలోచింపను అదంతయు న్యాయముగను యుక్తముగను సులభముగఁ దప్పించుకొనను సాధ్యము గానిదిగను మనసునందు నాటుకొనినది. కేశవరావు మనస్సు సులభముగాఁ దన అంతరాత్మ కెదురుపోయినది గాదు. ఇప్పుడిక్కడ మిక్కిలిచిక్కు తటసించినది. చిన్ననాఁటనుండియు మఱిసికొనుచు ఎన్నియో ఆకసపుఁదిబ్బ్లు పెట్టుచుండిన రామన్న సంబంధమును జేయునదా ఇప్పుడువచ్చిన గొప్పదియు అన్ని విధముల బిడ్డకు క్షేమతరమైన కృష్ణరావు సంబంధమును జేయునదా? మనసొక త్రొక్కుడుచుచున్నది. బుద్ధి మఱియొక త్రొక్కుడుచుచున్నది. కేశవరావు కేమియుఁ దోఁపలేదు. ఏదియెట్లున్నను ఎన్నిచిక్కులు వచ్చినను ఎన్ని సంకటములు కలిగినను ఎవరేమనుకొనినను బిడ్డక్షేమమును జూచుట తనకు అలంఘనీయమయిన విధియని నిర్ణయించుకొని ఇదంతయు భార్యతోఁ

జెప్పుటకు ఆమెను "ఇదిగో యిట్లురా ఒక్క పెద్దచిక్కు వచ్చినది. నా కేమి తోఁచలేదు" అని ఆమెను బిలిచెను. ఆమెయును ఏమి సంకటము వచ్చినదోయని భయపడి తొందర తొందరగాఁ తత్తరపడుచు వచ్చి "ఏమీ ఏమివచ్చినది ఇప్పుడు. మీరు ఎప్పుడెంత కష్టమువచ్చినను జంకువారుకారే. ఇప్పుడేమింత భయపడియున్నారే. ఏమిసంకటము వచ్చినది?" అనిఆతురత తోఁ బలుకగాఁ గేశవరావు ఆమెత్రోటుపాటు చూచి యిది యేమి యుపాయము చేయునోయని తనమనస్సంకటమును సాధ్య మైనంతమట్టుకు లోననణఁచుకొనుచు శాంతముగా నిదానముగా నిట్లుచెప్పెను. "రాజమహేంద్రవరములో సుప్రసిద్ధులైన కృష్ణ రావు పంపగా సుబ్బయ్య అనునతఁడు నాతో మాటలాడుటకు వచ్చియుండెను. కృష్ణరావునకు ఆప్రక్క మిక్కిలి పలుకుబడి కలదఁట. ఆయనకు సంవత్సరమునకు ౫౦౦౦౦ రూపాయలు వచ్చు భూములును రాజమహేంద్రవరములో ఎన్నియో బంగళాలు తోఁటలు ఇండ్లు ఉన్నవంట" చిన్నమ్మ "ఉన్ననే మంట. మనకేలఅదంత." కేశవరావు "సుబ్బయ్య చెప్పినది, కృష్ణరావుకు అన్నదమ్ములుగాని అక్కచెల్లెండ్లుగాని ఎవ్వరు లేరు. తండ్రిఆస్తిలోఁ బాలుగోరువారెవ్వరులేరు. ఒంటరిసంసార మైనందునఁ ద్వరగాఁ బెండ్లి చేసికొనవలెనని కృష్ణరావుకు అభిలాష కలిగి సంబంధమును - చిన్నమ్మ "మనకున్నది ఒక్కబిడ్డ. ఆబిడ్డను, ఆమెపుట్టినది మొదలు సంబంధము నిర్ణయమయ్యె

యుండెను. ఇకమనయింట సంబంధమునుగూర్చి మాట్లాడుట కే యేమున్నది." కేశవగావు "అదంతయుఁ జెప్పితిని. దాని మీఁద ఆయనచెప్పిన విషయములు కొన్ని నిదానముగా ఆలోచింపఁదగినవి గానేయున్నవి. అన్నివిధముల బిడ్డకేదిలాభకరమో చక్కఁగా ఆలోచించి తెలిసికొని దానినే చేయవలెను, గాని మఱియొకటిగాదు దానివలన మనకేమికష్టములు వచ్చినను ఏమిచిక్కులు కలిగినను ఏమిలోపములు సంభవించినను వాని నన్నిటిని భరించి బిడ్డకేది శ్రేయస్కరమో దానినేచేయవలెను. బిడ్డశ్రేయస్సు మనకన్నిటికంటెఁ బ్రధానమైనది. ఇప్పుడువచ్చి యుండు సంబంధము మిక్కిలి గొప్పది, తక్కినదానికన్నఁ జాల ఎక్కువైనది. బిడ్డకెంతో శ్రేయస్కరమైనది కాదని నీవు మాత్రము చెప్పఁగలవా, చక్కఁగా యోజించుము."

చిన్నమ్మ:—ఈసంబంధము తక్కువసంబంధమని నేను మాత్రమెట్లు చెప్పఁగలను నేనుజెప్పునదదిగాదు. ఈసంబంధ మెట్టిదైననగుఁగాక, ఆసంబధము నెట్లువదలునది. వాండ్రు పుట్టినది మొదలు మనబిడ్డను రామన్నకే యిత్తుమనుకొని యుంటిమి. అందఱితో నట్లెచెప్పుచుంటిమి. లోకమంతటను నట్లె వెల్లడై యున్నది. ఇప్పుడుదానిని గాదనుటసముచితమా-లోక ముమెచ్చునా-మనబిడ్డతోసమముగా మనము చూచుకొనుచుం డినరామన్నను ఇప్పుడు నెత్తినకొంగువేసికొని పొమ్మందుమా! ఇదిన్యాయమా ఇదిధర్మమా లోకములో నందఱునేమందురు.

ఇంతకాఠిన్యమా ఇంతద్రవ్యాశయా, ఏమిన్యాయము ఏమినీతి యనరా, ఊరిలో నలువురిలో ఏమొగముతోఁదిరుగఁగలము.

కేశవరావు:—వెల్లడిగా ఇదివఱలో నిశ్చయించుకొని యుండినట్లు జరుపక దానికి భిన్నముగా జరిపినంతట లోకులు తిట్టునది మనకు, దానివలనవచ్చు నిందమనకు రామన్నకుఆశా భంగము గల్పించుటవలనఁ గల్గుమనఃకష్టము మనకు, నిజమే ఇవిసామాన్యమైన సంకటములుగావు. భరించుటకుఁగష్టమైనవే. అట్లని మనకువచ్చు గొప్పచిక్కులను దప్పించుకొనుటకుఁగా మనబిడ్డను అడ్డపెట్టఁదగునా. ఈతిట్టులు, ఈనిందలు, ఈమనః కష్టము ఇవన్నియుఁగొంతకాలము మాత్రము ఉండఁగలవే, స్థిర ముగానుండునవికావు కాలక్రమమున సమసిపోఁగలవు. సంబం ధము అట్టిదిగాదు. ఈసంబంధమును ఇపుడువిడిచిపెట్టి ఇంకొక సంబంధము చేసినంతట ఈసంబంధమును విడనాడుట వలనఁగలుగు నష్టము స్థిరమైనది. మనబిడ్డకు స్థిరమైనఅపకారము చేసినవారమవుదుము. కనుకవిధిలేక ఈసంబంధమును అంగీకరింప వలసినట్లేర్పడుచున్నది. దైవఘటన ఇట్లున్నట్లున్నది. ఇదిమన బిడ్డయొక్కమనయొక్క మంచికే గనుకమనకష్టములను సంకట మును, అన్నిటిని గట్టిమనసుతో ఓర్పుదెచ్చుకొని సహించి బిడ్డ సౌఖ్యమునకు లోపములేకుండఁజూచుకొనుట మనకువిధి. ఆవిధిని దప్పించుకొనలేము. ”

కేశవరావుగారు మనసు దిటవుచేసికొని ధైర్యముతో నిదంతయుఁ జిన్నమ్మతోఁ జెప్పెను గాని ఆయన మనసులోఁ బెరుగుచున్న మనస్సంకటము అపరిమిత మయినది. రామన్నకు బిడ్డనిచ్చుటకు అదృష్టము వచ్చెనే యన్న విషాదము చెప్పనలవి గాదు. అదొక ఓ కలవరమయిపోయినది. అధిక జ్వరపీడితునికి మనసులోఁ దట్టినపదమును వదలలేనట్లు కేశవరావుకు రామన్నకు బిడ్డనిచ్చుటకు లేకపోయెనే ఇంకెట్లు" అనువాక్యము మనసులో విడవరానిదాయెను. "రామన్నకు బిడ్డనిచ్చుటకు లేకపోయెనే ఇంకెట్లు"! బిడ్డను రామన్నకిచ్చుటకు లేకపోయెనే ఇంకెట్లు!! కన్నులు మూసికొన్నను "రామన్నకు బిడ్డనిచ్చుటకు లేక పోయెనే ఇంకెట్లు" అని పలకమీఁద వ్రాసి యెదుటఁ బెట్టినట్లు తోఁచును. క్షణ మూరకున్న "రామన్నకు బిడ్డనిచ్చుటకు లేక పోయెనే" యన్నవాక్య మెదుట వచ్చి నిలుచును. కేశవరావు స్థితి యిట్లున్నది. ఇంకఁ జిన్నమ్మ మనస్సంకటమును జెప్పుటకే సాధ్యముగాదు. కన్నీటిధారకు విరామమే లేదు. భర్త చెప్పిన దంతయు వినుటయేగాని భావము పూర్తిగా బోధయై యుండదు.

ఏదెట్లున్నను దీనిని బిడ్డలకుఁ దెలుపవలసి యున్నది. తెలుపకతీఱదు. ఎట్లు తెలుప వచ్చును. ఏముఖముతో వారల కీవార్తను జెప్పవచ్చును. ఏవిధముగాఁ బ్రస్తావింప వచ్చును. కేశవరావు కేమితోఁచలేదు. ఉండియుండి యీదుర్వార్తను

తెలిపినంతట గుండె లవియునేమో, ఏమిసంకటపడుదురో, ఏమి
విషాదమగునో, ఏమి కష్టకాలము వచ్చినది" కేశవరావు
ఆయనజన్మములో నిట్టికష్టము నెప్పుడు అనుభవించి యుండలేదు.

సీతమ్మకీగొడవ యేమియుఁ దెలియదు. ఆమె తనగదిలోఁ
గూర్చుండి యేదియో పుస్తకమునుఁ జదువుకొనుచుఁ దనలోఁ
దాను ఆనందించుచుండెను. అప్పుడు కేశవరావును జిన్నమ్మయును
నిరువురువచ్చి "అమ్మాయీ" అని ఎచ్చరించిరి. సీతమ్మ తల
నెత్తి చూచి దిగ్గున లేచివచ్చెను. ఆమెను జూడఁగానే చిన్న
మ్మకు ఆఁపలేని దుఃఖమువచ్చెను. కేశవరావునకు గన్నీరు
నాఁపుట అసాధ్య మాయెను. పెదవులు అస్వాధీనముగ వణఁక
సాగెను. ముఖమున దుఃఖసూచకములగు ముడుతలు మెండయినవి.
ఇవన్ని చూడఁగానే సీతమ్మకు ఏమియుఁదోఁపక దేహమంత
యుఁబదురుపుట్టెను. కాళ్ళు తడఁబడుచుండఁగా సీతమ్మయెదురు
గాఁబరువెత్తుకొని పోయి అమ్మను గౌఁగిలించుకొని "ఏమే
యమ్మా యేమికష్టమువచ్చినదే చెప్పవేయమ్మా! నాయన కేమి
యైనఁగష్టము వచ్చినదా, నీకేమియైనకష్టమువచ్చినదా, బావకే
మైన సంకటమా! చెప్పుమమ్మా నామనసు నానావిధములగాఁ
జిందఱ వందఱయై పోవుచున్నదేయమ్మా! నేను నిలువలేనే
యమ్మా" అని కూరుచున్నది. కేశవరావును జిన్నమ్మయును,
ప్రక్కను గూరుచుండిరి. చిన్నమ్మ సీతమ్మ తలనుదన యురము

మీఁదకుఁ దీసికొని బుజ్జగించుచుండఁగాఁ గేశవరావు "ప్రమాద మేమిలేదమ్మా, నీకు ఒకక్రొత్త మనువు వచ్చినది. అది చాల గొప్ప సంబంధము. మిక్కిలి ప్రసిద్ధమైన కుటుంబము వీరికి సం॥ర మునకు ౫౦౦౦౦ కుఁ బైగా రాఁగలదు. వీరా త్కట్లు కంతయు ఎక్కువ పలుకుబడిగలవారు. ఇట్టి యీసంబంధమును విడిచిపెట్టి పోమ్మనుటకు వీలులేక తటస్థించుట చేత రామన్నకెట్లు సమా ధానము చెప్పి సమ్మతింపఁజేయగలమా యని ఆలోచనగా నున్నది. ఇంతేగాని ఇంకఁ బ్రమాదమేమి లేదమ్మా, భయపడఁ బనిలేదమ్మా" అని చెప్పఁగనే సీతమ్మకు గుండె జల్లుమనినది. ఒడలెల్ల పదురుపుట్టినది. అస్వాధీనముగఁ గన్నీరు గారుచున్నది. తలగిఱ్ఱుమన తిరుగఁ జొచ్చినది. దిక్కు తోఁచలేదు సర్వము నంధకారమయమైనది. తల్లి యొడిలోనికిఁ దిన్నఁగ వ్రాలినది. కన్నులును మొగమును జన్నీళ్లతోఁ దుడువఁగాఁ గొంతసేప టికిఁ దెప్పఱిల్లి వెక్కివెక్కి పడుచుఁ దలవంచుకొని నిశ్చేష్టితు రాలై యుండి మెల్లఁగ గన్నులు తెఱచి తలిదండ్రులను దల యెత్తిచూచి అమ్మంతో అమ్మా నాయనను జూడవే, అమ్మా మీరెట్లు కష్టపడు చుండఁగాఁ జూడలేనే, కడుపులో ఏమో ఒక విధమయిన జాలి పుట్టుచున్నదే నాకోసమై మీరింత కష్టపడ వలదమ్మా నేను మీ కడుపులోఁ బుట్ట లేదనుకొనుఁడమ్మా. ఎట్లుకావలసినద ట్లగునమ్మా. కష్టపడవలదమ్మా" అని ఊర కుండెను. ఇఁకదీనిని రామరావుకుఁ దెలుపవలసిన కష్టకార్యము భారము కేశవరావు పైననున్నది. దానినెట్లు నిర్వహించునది.

కేశవరావు రామరావు వాకిట బండి దిగుచుండఁగనే రామరావును ఎక్కడకో బైటఁ బోయియుండి అప్పుడే బండి దిగెను. కేశవరావు "నాయనా నీతో మాట్లాడ వలసియున్నది" అని చెప్పుచు ఇద్దఱు లోనికిఁ బోయిరి. రామరావు కేశవరావు ముఖముఁ జూచి "మామయ్యా మీముఖముఁ జూడగా మీ కేదో గొప్ప విచారముతో నున్నట్లు తోఁచు చున్నది. మీ రెప్పుడుగాని ఎట్టికష్టములకుగాని జంకుస్వభావము గలవారుగారే ఇదేమిప్పుడిట్లు—కేశవరావు "నాయనా, మిక్కిలి గొప్పచిక్కు తటస్థించినది. నేనెప్పుడుగాని యింతటి సంకటము ననుభవించిన వాఁడనుగాను" అనుచు లోపలికి లక్ష్మీదేవి యుండుచోటికిఁ బోయిరి. కేశవరావు—"రాజమహేంద్రవరములో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన కుటుంబ మొక్కటియున్నది. ఇప్పుడాకుటుంబము నకుఁ బెద్ద కృష్ణరావు. ఆయనకు ఇరువది రెండేండ్లుండును. రూపవంతుడు. సంవత్సరమునకు ఏఁబదివేలు రూపాయలకుఁ బైగావచ్చు భూములున్నవి. బంగళాలును ఇండ్లు అనేకమున్నవి. ఆయనది ఒంటరికాపురమైనది గాన త్వరలోఁ బెండ్లిచేసికొన వలెనను తలంపుగలిగి యుక్త సంబంధమునకై విచారించు చుండఁగా మన కుటుంబముల సంగతి తెలిసి సంబంధము చేయుటకు ఈ కుటుంబము చాల అర్హమైనదనియు; అన్నిటికన్న మిక్కిలి యుక్తమైనదనియు భావించి సుబ్బయ్య అనువాని మూలముగా నాయొద్దకు మనువును బంపినాడు" మనువు

అనఁగానే లక్ష్మీదేవమ్మ ఉట్టిపడి, "ఇప్పుడు మనయింటికి మనువేమిటి? ఎవరికి మనువు? మనకున్నది ఒక్కటేఁడు బిడ్డసీతమ్మ. ఆమెపుట్టఁగనే ఆమెకు మనువువచ్చినది. మనకున్న ఒక్కమగబిడ్డ రామన్నకిచ్చి పెండ్లిచేయునట్లు మనువునిర్ణయించుకొని నిశ్చయించుకొని యున్నాము. ఇది మీబావగారుండఁగానే అయిన నిర్ణయము. ఇట్లుండగా ఇపు డింకమనువులేమిటి? ఆయనతో ఆమాటచెప్పి పంపివేయకుండనేల?" కేశవరావు:-"అట్లు చెప్పిపంపివేయఁ జూచితిని గాని దానిమీద ఆయన చెప్పిన విషయము మిక్కిలి ఆలోచింప వలసినదిగాను న్యాయమైనదిగాను ఏర్పడినది.

లక్ష్మీదేవి:—నిర్ణయ మయినదానికి ఆలోచనయేమిటి? ఎడమిచ్చినంతట ఏమేమో విషయములు చెప్పుచునేయుందురు. వారి వారి కార్యములు సాధించుకొనుటకు ఎన్నెన్నో కథలు చెప్పుదురు. అవన్నిమన కేల? అవన్ని పాటింపవలసిన యవసరము మనకేమి?

కేశవరావు:—అమ్మా నీవు చెప్పినది కొంత మట్టుకు సరియేగాని అయినను నామనసులో నున్నది చెప్పెదను. కొంత నిదానముగా విను. తలిదండ్రులు బిడ్డలకు దేవుఁడు నిర్ణయించిన సంరక్షణ కర్తలేగాని వారిని ఇష్టమువచ్చిన విధమున వినియోగింపనర్హులుగారు. తలిదండ్రులు తక్కినసొత్తులనువలె బిడ్డలను

భాషింపరాదు. అట్లుబిడ్డల నుపయోగింప నధికారములేదు. తలి
దండ్రులకా స్వాతంత్ర్యమును దేవుఁడీయలేదు. (అని చెప్పుచుం
డఁగా బాలయ్య మిక్కిలి ఉద్ధృతితోఁ గాళ్లు తడఁబడుచువచ్చి
కేశవరావునుచూచి ఎచ్చరించుకొని) బాలయ్య:—ఇదేమిటి
విపరీతము! మామయ్యా ఇదేమిటిది ఊరంతట ఒకటే రచ్చగా
నున్నదే. ఇల్లుగూడ నుండునా ఎవఁడో మనసీతమ్మ కిప్పుడు ఒక
మనువు తెచ్చినాఁడఁట. చాలడబ్బుగలవాఁడఁట. డబ్బు కాశపడి
మీరు ఒప్పుకొని నారఁట. ఇదెంత నిజమోగాని వినుటకే
ఘోరముగా నున్నది. అసహ్యముగా నున్నది. సీతమ్మ నిచ్చు
టకు మీరొప్పు కొనినారఁట. డబ్బుకులోఁబడి సీతమ్మను దీసి
కొనిపోయి ఎవనికో పేరు ఊరు దెలియని వానికిచ్చి కట్టిపెట్టు
టకు సమ్మతించి నారఁట. ఇదేమి కలయాయేమిటి. ఇతుననుటకు
మీకెట్లునోరాడెను? ఒకనికిచ్చునట్లు చెప్పియుండి ఆవలమఱిఒకని
కిత్తునని చెప్పుటకు మీకేమి యధికారము. ఆమహానుభావుఁడు
చేయెత్తి దండము పెట్టవలెను—ఆమహానుభావుఁడు రంగరావు
జీవించి యుండఁగానే యెప్పటి నుండియో సీతమ్మను రామన్న
కిచ్చి పెండ్లిచేయు నట్లనుకొని యుంటిరి. ఇదిఊరంత నెఱుఁగును.
లేదనఁగలరా! ఇప్పుడు దానినిట్లు మార్చవచ్చు. ఇదేమి
న్యాయము ఇదేమినీతి! నాయనగారు జీవించి యుండిన మీరిట్లు
చేయ సాహసింతురా? ఇంతటి దౌష్ట్యమునకుఁ బూనుకొన
ధైర్యముండునా? ఇంతవఱకు మీకును లోకములో మంచి పేరే

యుండును. మీ అంతరాత్మకు విరుద్ధముగాఁ బోరనియు ధర్మ మార్గమును వదలరనియు, ఎంతకష్టమైనను, ఎంతనష్టమైనను న్యాయ్యముగానే వర్తింతురనియు మీకెంతో మంచిపేరుండినది. అదంతయు ఇప్పుడు మాఁటిపోయినది. మీకన్న నెక్కుడు క్రూరులు ద్రవ్యాశగలవారు ఉండరనుచున్నారు. నేనెప్పుడు గాని ఇంతకఠినముగాను ఇంత నిర్దాక్షిణ్యముగాను మీతో మాటాడినదిలేదు. జరిగిన సందర్భమును బట్టి విధిలేక ఇట్లు మాటాడవలసి వచ్చినది. చేయిదాఁటినంతటఁ ద్రిప్పుకొనలేము. ఏమో చెప్పినా వినుకొనవలదు. ఇప్పటి కైనను జక్కఁగా నాలోచించి త్రిప్పుకొనుట యుక్తము.

కేశవరావు:—నాయనా బాలయ్యా నీవుచెప్పినదంతయు శాంతముగా విన్నాను. నీవిట్లు కఠినముగాను నిర్దాక్షిణ్యముగాను మాటలాడుటకుఁ గావలసినంత కారణము కలిగి యున్నది. ఇప్పుడు జరిగిన సందర్భము అందఱకును మనస్సంకటమును గలిగించునట్టిదే. కనుకనే నీవు కఠినముగా మాటలాడినది తప్పుగానేను దలపలేదు. నీకుఁ గలిగినంతటి ఖేదము నాకునుగలిగియే యున్నది. ఈకష్టస్థితికి కారణము కొంతమట్టుకు నేనేయౌట నెఱుఁగుదును గాని నామనఃకష్ట మందఱ కష్టముకన్నను మిక్కిలియైనది. సదా అదే కలవరముగానున్నది "మన రామన్నకు బిడ్డ నిచ్చుటకు అడ్డము వచ్చెనే" యన్నచింత నన్ను విడుచుటయే

లేదు. నిద్రాహారములలోఁగూడ బాధించు చున్నది. అయిన నేమి చేయఁగలను. విధిలేని ఘట్టము వచ్చినది. అనుభవింపక తీఱదు. దైవాజ్ఞ యెట్లున్న నట్లుకావలెను. మనముదానినాఁపలేము

ఏదెట్లున్నను, ఏమెట్లయినను మనమందఱమును బిడ్డ క్షేమమును జూడవలసిన వారము. అందులకై సర్వవిధములఁ బాటుపడ వలసిన వారము. అది దైవాజ్ఞ - ఆమె కేది లాభ కరమో దానిని దప్పక చేయవలయును. ఇతరాలోచనలు అడ్డము రానీయరాదు.

లక్ష్మీదేవి:—చిన్ననాఁటినుండి ఒకటిగా ఆడుచుఁబా డుచు బెరిగి పెద్దవాండ్రై పెండ్లికీ ఈడువచ్చి ఇప్పుడో రేపో పెండ్లిచేసుకొనెద మనుకొనుచు ఉవ్విళ్లూరుచు ఏమేమో ఊహాలఁ బెంచుకొనుచు ఆనందించుచుండు వారి ఆశలకు ఊహా లకు అన్నిఁటికిని ఉన్నట్లుండి మిన్నువిఱిగి నెత్తినఁ బడినట్లు భంగము కలిగించుచు వారికిఁ దిరుగుడులేని యెడఁబాటు కావిం చుట బిడ్డకు క్షేమము చేయుటగునా. ఏవిధమయిన లాభము గును? ఇద్దఱు బిడ్డలకును దొలగింపరాని యపకారమును దుద లేని విరోధమును గావించిన వారమవుదుము. ఇద్దఱ జీవితము లను జీవములున్నంతవరకు విడుపులేని భారముగాఁ జేయుటౌను. ఇది మేలుచేయుటకాదు. ఇది లాభకరముగాదు. పరస్పరము మిక్కిలి అనురాగము గలిగి ఆనందము ననుభవించు చుందువా

రిని వేఱుపఱచుటకన్న క్రూరతగాని పాపముగాని వేఱులేదు. అన్నయ్యా ఇప్పటికైనను దిరుగవలెను.

కేశవరావు:— అమ్మా నేనంత అనాలోచితముగా దీనిలో దిగలేదు. అనురాగమనునది వారివారి గుణములను మనస్సులను అనుసరించియున్నది. వివాహానంతరము భార్యాభర్తలకుఁ బరస్పరాను రాగము గలిగియుండుట విధిలేని చర్యయనియు, అది మన నిర్దిష్టమైనదనియు, మన దేశ మతాచారము. కాబట్టి మన దేశములో సాధారణముగా వివాహానంతరము పరస్పరాను రాగమంకురించి దృఢమై పెరిగి కుటుంబమంతటికి వ్యాపించుచున్నది. వివాహపూర్వాంకురిత ప్రేమ అంత దృఢముగానిలువదు. అపాయములకు లోఁబడి క్షీణింపకుండఁ దప్పించుకొనుట సాధారణముగాఁ గష్టము. వివాహానంతరము విధిగాఁగలిగిన ప్రేమ సామాన్యమయిన అడ్డంకులకు లొంగక తప్పించుకొని దృఢపడఁగలదు.

బాలయ్య:—అనగా వివాహపూర్వము పరస్పరానురాగముగలవారు ఒకరినొకరు పెండ్లి చేసికొనఁ గూడదనియా మీయభిప్రాయము ?

కేశవరావు:—అట్లుగాదు. వివాహానంతరము విధిగాఁ గలిగి తప్పించుకొనలేని కూర్మి పెండ్లికిముందు యాదృచ్ఛిక

ముగాఁ కలిగిన ప్రేమకన్న నెక్కుడు దృఢమైనది. ఎక్కుడు స్థిరమైనది అని భావము. అది స్వభావము. ప్రాయికముగా మనదేశములోఁ బెండ్లిండ్లయిన తరువాతఁ బ్రేమాస్పదము గలిగినది అట్లుకాక పెండ్లికి ముందే ప్రేమాంకురము గలిగి యుండునది మిక్కిలి అరుదు. పాశ్చాత్యాది దేశములలోఁ బెండ్లికిముందుగాఁ బ్రేమగలిగి ఆవలఁబెండ్లియాడుట వార్లలో సహజము. అట్లుగాని పెండ్లిండ్లు వార్లలో అరుదు. ఇట్లుం డఁగాఁ బర్యవసానములో మనదేశములోని పెండ్లిండ్లే వారిదేశ ములోని పెండ్లిండ్లకన్న దృఢప్రేమానుబద్ధములనియు గృహ సౌఖ్యదాయకములనియు అనుభవవేత్తలు చెప్పుదురు. ఏదెట్లున్నను గుణవంతులకు వివాహానంతరమైనను బ్రేమాను బంధము కలుగక తీరదని దృఢముగాఁ జెప్పగలను. లోకమంతయు నెఱుంగును గనుకఁ బ్రేమానుబంధమును గుఱించి చింతింప నక్కఱలేదు.

రామరావు:—మామయ్యా నావిషయము నేను మీతో ఎక్కువ చెప్పికొనఁ జాలను. నాకుఁగా మాటాడ వలసిన వారును మీరే. సీత పుట్టినదిమొదలు నాకిచ్చి పెండ్లి చేయు నట్లు చెప్పుచుంటిరి. మేమిరువురమును ఆయూహాలతో ఆయాశ లతోనే పెరిగితిమి. ఇప్పుడు నీకిచ్చుటలేదు పొమ్మని నన్ను బంపివేయ మీకునోరెట్లుఆడినది. అదియు క్తమా న్యాయ్యమా!

కేశవరావు:—నాయనా అట్లనఁబోకు. నాగొంతులో ఊపిరిఉండఁగా నిన్ను అట్లు పొమ్మంటినా? నిన్నట్లువిడుతునా? నాయనా! నీకు సీతను ఇచ్చుటకు అడ్డము వచ్చినేయున్న పిశాచము వదలకుండ నన్ను వేఁపించుచునే ఉన్నది. అయిన నేమి చేయఁగలను; బాధపడవలసినవాఁడనేగాని తప్పించుకొన లేను. విధిని విడువలేను. నామనస్సాక్షికి విరుద్ధముగా సీతకుఁ బెండ్లిచేయలేను. కాని నిన్నువిడనాడుట నాజీవిత కాలములో లేదు. సీతతో తుల్యముగా నింకొకబిడ్డను బెంచి నీకుబెండ్ల — !

బాలయ్య:—మామయ్యా మామయ్యా! ఆఁగవలెను. రామన్నకు సీతమీఁది ప్రేమను మార్చుకొనుటకు లేకయేకాని, కావలెనన్న ఆయనకుఁ బెండ్లి చేసికొన వగలేకపోలేదు.

కేశవరావు:—నాయనా, కోపపడకు. అదికాదునాభావము. నామనసు చాలఁ జీకాకుపడియున్నది, ఒక్కటి చెప్పఁ బోయి యింకొక్కటి చెప్పుదునో యనికూడ సంకోచము గలుగుచున్నది.

రామరావు:—మామయ్యా లోకములో ధనముతప్ప నింకేమిగణింప వలసినదిలేదా? గుణమెట్టిదని చూడఁబనిలేదా?

బాలయ్య:—మామయ్యా గుణములేనంతట ధనముం డినఁ బ్రయోజనమేమి. అది నాగుఁబాము నోట విషమువలె లోకమునకు మఱింత చెఱుపునకేగదకారణ మగును.

కేశవరావు:—తెలిసినంతలోఁ జాలఁగలిమిగల కుటుంబమని యేర్పడినది గుణవంతుఁడనియే తెలియుచున్నది. జాతకమును జూచినాను. రెండుజాతకములును ఒకటి నొకటి చాలఁ బోలియున్నవి. రెండిఁటికిని లగ్నము మీనము, నక్షత్రము కృత్తిక, గ్రహకూటము గూడఁ జాలఁబోలియున్నవి. రెండుజాతకములును గుణవంతములె. అట్లుండఁగా అక్కడ సుగుణములు లేవనుటకుఁగాని దుర్గుణము లున్నవనుటకుఁగాని సరైన ఆధారము లేమిలేవు.

బాలయ్య:— మామయ్యా, మీరాశాస్త్రము చదివి యున్నారు గాన మీకాశాస్త్రమునందు ఎక్కువ విశ్వాసము గలిగి యుండవచ్చును. మాకాసంగతి యేమి తెలియును. అన్నింటిలో జాతకముల ప్రకారము నడుచుకొన అందఱకు ఎట్లుసాధ్యము?

కేశవరావు:—ఇఁక శాస్త్రమునే నమ్మకపోయిన కార్యములన్ని నెఱవేర్చుకొనుటెట్లు? ఎన్ని సందర్భములలో నిషయము నిర్ణయముగాఁ దెలిసికొనలేనప్పుడు శాస్త్రమును నమ్మి జాతకములననుసరించి పోవుటలేదు? శాస్త్రమే సత్యము గాక పోయిన మనకాధార మేమి?

బాలయ్య:—శాస్త్రము సత్యముగానే ఉండవచ్చును. దానిని బక్కఁగా నుపయోగించుచున్నామా, అనునదిసందే

హాము. ఒక్కొకప్పుడు జాతకకాలమును నిర్ణంచుటె కష్టము ఇఁకలగ్నమును నిర్నయించుట అసాధ్యము. అయినను ఏదో ఒకవిధముగా జాతకమును మాత్రము వ్రాసియుంతురు. అట్టి జాతకముతో ఉపయోగమేమి? శాస్త్రముసత్యమే అయినను గూడఁగ్గాలము స కాకపోయినను, లగ్నము సరికాకపోయినను జాతకము అసత్యమే.

కేశవరావు:—బాలయ్యా నీవుచెప్పినది సరియేకాని అదిత్రంతటవ్యాపింపదు. జాతకఫలము అనుభవములో జరుగు చున్నంతట, ఆజాతకము సత్యమైనదేయని తలఁపవలె. కాలము లగ్నముసరియైనవిగ్గానే ఉండవలెను.

బాలయ్య:—అనుభవములో ంతయుఁ దెలిసినంట జాతకమునతో అవసరమేమి?

కేశవరావు:—రానున్నదానిని ఊహించుట కుపయో గించును.

బాలయ్య:—ఏమిఊహా? ఏమిఉపయోగము? ఊహిం చినప్రకారము మేలు జరిగినప్పటికిఁగూడ బహుకాలముగా ఊహించుచుండినందున దానిలోని చవి, సారస్యము, నవీనత అడఁగిపోవుచున్నవి. ఊహించిన మేలుజరగక పోయినంతట అనవసరమైన ఆశాభంగము, లేనిపోని ఖేదము, కలుగుచున్నవి. కీడు నూహించియుండి మేలుజరిగిననుగూడ మధ్యకాలములో

లనవసరమైన చింతననుభవింప నేల. ఈఊహాలను విడిచిపెట్టి అనుభవముల ననుసరించి మనకార్యములను నెఱవేర్చుకొనుట యుక్తముగాదా, మామయ్యా మీకు నేను జెప్ప పలసినదే మున్నది. మీకుఁ దెలియని దేమున్నది. ఊరిలోమాత్రము విన గూడని అపవాదము గానున్నది. ఊరిలో ఏమూలఁ బట్టినను, ఏసందుగొందులలో విన్నను ఇదేప్రచారము. ఏనోటఁబట్టినను దిట్టుటెకాని అయ్యో పాపము ఏమిసందర్భమో, ఏమికారణమో అనుమానపుడుటేఁడు. కేవలము ద్రవ్యకాంక్ష చేతనే ఇట్లు చేయుచున్నారని యనేకుల యభిప్రాయము. కొంతమంది యింకను దీవ్రముగాఁ బోవుచున్నారు. మీరుస్వలాభాప్తము వర శుల్కముఁగూడఁ దీసికొనినారని ప్రేలుచున్నారు. ఎవరినోరు మూయఁగలము. లోకములోని మూఁక సాధువులను నిందించుట కేది సాకాయని వెదకుచుందురు. కష్టకాలము వచ్చినది అను భవింపక తీఱదు.

కేశవరావు:—నాయనా మనమేమి చేయఁగలము. నేను నామనస్సాక్షికి విరోధముగాఁ బోలేదు. విధికృతము నను సరించు చున్నానేగాని వేఱుగాదు. నేనక్రమములో దిగలేదు. అని దృఢముగా నమ్మియున్నాను. నేను ఏదైనఁ దప్పుచేసి యుండిన దానికై లోకులు నన్ను నిందించినంతట, ఆనిందను బడవలసిన వాఁడనే, ఆకష్టము ననుభవింపవలసిన వాఁడనే,

అది న్యాయ్యమే. అట్లుకాక నాయందు లోపములేకయే, లోకులు నాయందులేని నేరమునుఆరోపించి అక్రమముగా నన్ను నిందించినంతట తప్పు నాదిగాదు వారిది. అట్టియెడ దానిని గమనింపకుండుటే మనము చేయఁదగినపని, కాలక్రమమున నిజము బైట బడును.

రామరావు:—మామయ్యా మీ మనస్సంకటమును జూచుచున్నాను. నామనస్సంకటముకన్న మీ మనస్సంకట మెక్కువైనదని యిప్పుడు కనుగొన్నాను. మీ మనస్సంకటమును జూచి నామనస్సు ఛిద్రమగుచున్నది. మీరు నాకై చింత పెట్టుకొనవలదు. నేనును మనసును దృఢముచేసికొని దుఃఖమును అడఁచుకొనెదను. నేను ఇందులకై ఎవ్వనిమీఁద గాని క్రోధమునేని అతృప్తినేని ఉంచుకొనను. సీతపెండ్లి అగు వఱకు నెక్కడకుఁబోను, మందలనేయుందును. దైవనిర్ణయము ప్రకారము ఆమె మెడలో మూడుముళ్లు పడఁగనే నేను బ్రహ్మచర్యవ్రతమును అవలంబించెదను. ఇది మీమనసు కరగించుటకుఁ జెప్పినదిగా భావింతురేమో. అట్టి దెంతమాత్రము గాదు. ఇది అభినయముగాదు. త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నాను. మీమనఃక్షోభమును మీమనోదార్ఢ్యమును మీ తెంపును జూచిన నాకాశ్చర్యమైనది. అట్టి మనోగాంభీర్యమును, అవలంబింప దేవుఁడు నాకును బుద్ధి పుట్టించుచున్నాఁడు. ఇది మనందఱ మంచికే; దైవాజ్ఞ. నెఱవేఱక మానదు.

బాలయ్య:—ఇదేమిటిదంతయు కలయా లేక నాబు ద్ధియే భ్రాంతి చెందుచున్నదా? నాకేమి తోఁచకున్నదే? లేక మీకిద్దఱకును బుద్ధిభ్రంశము గలుగుచున్నదా? ఎక్కడి మనో దార్ఢ్యము. ఎక్కడి తెంపు? ఎక్కడినుండి వచ్చినవివన్నియు, ఎప్పుడువచ్చినవివన్నియు? పైన బ్రహ్మచర్యవ్రతము గూడనా? నీలో మెదువు చూచిగదా యింద ఱిన్ని ఆటలాడుటకు ఎడమ యినది. నీలో ఈమనోదార్ఢ్యము, ఈతెంపు మొదటినుండి యుండినంతట ఈపరిస్థితులు వచ్చియే యుండవుగా! ఆదిలోనే అడఁగిపోయి యుండవా? ఇంత ముదరనిచ్చినందున ఇన్నికష్ట ములకుఁ గారణమైనది. మంచి విషయములలో మనోదార్ఢ్య మును తెంపును గలిగియుండుట యుక్తమే. అవశ్యమే. అయిన ఈవిషయము అట్టిదిగాదు. ఇది మంచిదైన విషయముగాదు. ఇదిచెడ్డదా విషయము. దీనివలన ఎంతో వృద్ధికిరాఁదగిన, ఎన్నియో సుఖముల ననుభవింపఁదగిన, ఇద్దఱు చిన్నవారల జీవితములు జీవించినంతకాలము వ్యర్థములగుచున్నవి. ఎంతో గణ్యములయిన రెండు కుటుంబములు ఛిద్రములై పోవు చున్నవి. ఇది మంచిదైన విషయమా? కడు చెడ్డదైన విష యము. దీనిని జరుగనీయ కుండుటకుఁగా మనోదార్ఢ్యమును తెంపును ఉపయోగింప వలెనేగాని ఇతరముగాదు.

రామరావు:— అన్నా బాలన్నా కోప పడవలదు. మామ తనమనస్సాక్షికి భిన్నముగాఁ బోలేక బిక్కపడి అన్ని

బాధలఁపడుచు అన్నింటికిని ఓర్చి విధి విధానమును నిర్ణయించు కొనినాఁడు. ఇఁకఁ దిరుగుటలేదు. దీనిని పెంచుటంతయు మామయ్య మనస్సంకటమును వృద్ధిచేసి నిరుపయోగముగా హింసపెట్టుటేయగును. నేనును మనసును దిటవుచేసుకొని నాను. శాంతి వహించి వికలము చెందకుండ ఓర్పుతో దైవ ఘటనను నిరీక్షించుటే యిపుడు చేయవలసినపని. నీవును అట్లే చేయవలయును. ఇల్లు పలుమారు ఈ విషయమును గురించి మాటలాడుచుఁ జర్చించుచు ఉండవలసి వచ్చినందునఁ గేశవ రావు మనస్సంకటము యొక్క చురుకుఁదనము పైకిఁగొంత మందగించి నట్లుండినదిగాని రామన్నకుఁ దనబిడ్డనిచ్చుటకు లేక పోయినందులకై లోలోనఁ గుములుచున్న చిచ్చు చల్లారుతీరు కానరాదు. ఇంట్లలో వీరిట్లు చిక్కులోఁబడి తెప్పిరిల్ల లేక బాధ పడుచుండఁగా బయటివారల ముచ్చటలను వినుటకు శక్యము గాదు. ఏసందులోఁబట్టినను ఏగొందిలోఁబట్టినను ఏమంచినీళ్ల బావిదగ్గఱఁ బట్టినను, చేరిన అమ్మలక్కలకు వేఱువార్తలు లేవు.



# ఆశ్వాసము 3



**మంచినీళ్ల గుంట యొద్దను ముచ్చటలు :**

నీళ్లకువచ్చిన యొకతె బిందెతో నీళ్ళుముంచుకొని ఒడ్డునకుఁదెచ్చి బిందెనెత్తి చంకను వేసికొనుచుండఁగా ఎదుటనీళ్లకు వచ్చుచుండిన యింకొకతెనుజూచి తనబిందెను మెట్టుమీఁద దించి క్రొత్తగావచ్చిన యాపెతో నిట్లు -

మొదటిది:—అమ్మో యిన్నాళ్లవంటే ఊళ్ళోపుకారా-ఆఁదొంతమ్మట్టుకునిక్కమొ

రెండవది:—(ఉత్తబిందెను మెట్టుమీఁదఁ బెట్టి) వినకేమి? గొప్పయిళ్ల వాళ్ల రహస్యాలు - మనబోఁటి వాళ్ళ ముచ్చట్లేగదూ - వినకేమి, కేశవరావు తనకూతుర్ని రామరావు కియ్యడంలేదని మొగరగొట్టాడంట. ఇదప్పుడే వూరంతా గుబులుకొని పొయ్యిందే, వినకేమి ?

ఒకటవది:—ఇదేమి న్యాయమమ్మా. యిన్నాళ్ళనుంచీ యిస్తానిస్తానంటూవుండి యిప్పుడు వున్నట్టుండి యియ్యడం లేదని మొగరగొట్టడం. యిదేంపరువా ? బలేపనిగదే.

మూడవది:—(అప్పుడేవచ్చి బిందెనాడఁబెట్టి) ఇదేం పరువుగా కేమి; మనమందరము యింతమంది అదేమాటలు మాట్లాడుకొంటూవుండామా లేదా, అది పరువుగా కేమి?

రెండవది:—ఇదే మనబోఁటివాళ్లెవరైనా చేసుంటే అదెంత ఆచ్చాపనగా వుణ్ణో? అందరు మొహంమీద గొట్టుందురు. కొలంలో మెలీగూడా బెట్టివుంట్రు.

మూడవది:—అయితే గొప్పోండ్ల కొకనాయం మన బోఁటోళ్ళ కింకొకనాయమా? లేదమ్మే. అక్కడేమో కిటుకున్నాది. కేశవరావు అంత అడావుడి మనిషిగాఁడు. అంత అక్రమంలోనికి దిగేఆయనగాఁడు...కాదుకాదు దీంట్లో యేదో చిక్కుండాది; అదింకాబాగా తెలుసుకోవాలా. లాకపోతే యింత ఆగడమా?

నాలుగవది:—(అప్పుడేవచ్చివిని) ఔనౌను. దీంట్లో ఏదో కొంత కిటుకున్నాది; ఇప్పుడు మామా అల్లుండ్లకు ఏదో కొంచెం జెడిసినట్టుండాది.

అయిదవది:—నేఁజెప్తా యినండి, నా యిూపదాలు కేశవరావు యింటికి రంగరావు యింటికి అడపాదడపా పోతా వస్తా వుంటుంది. రామరావు సీమకు బొయ్యిందే యిన్ని గొడవలు బుట్టినాయి. అక్కడ యెవ్వతెనో తెల్లదాన్ని దగ్గిరదీసి

నట్టుండాది. అది వీళ్ళకు తెలిసింది. సుజ్ఞమనింది. ఆయన సంబంధం మొగరగొట్టడానికి యేదేవిసాకా అని కనిపెట్టి వుండి నారు. ఈ కొత్తమనువు సాకుదొరికింది. యీాయనకేమో లచ్చలుండాయంట. యింత గొప్పసంబాదం వొచ్చింది గనుక రామరావు నెగరగొట్నాం.

ఆరవది:—(౫వది మాట్లాడుతుండగా వచ్చి జరుగు చుండిన దంతయువిని ముక్కుమీాద వ్రేలుపెట్టుకొని విసుకుతో) యిదంతా వుత్తదే. నేను దినమ్మూ కేశవురావుయింటికి, రంగ రావుయింటికి కాయగూరలు తీసుకపొయ్యి యిస్తావుంటా, ఆరొండు యిండ్లల్లొ జరిగేదంతా నాకుదెల్సు. నిన్నగూడా కేశవురావుయింటికి కాయగూరలు తీసుకపొయ్యి యిచ్చొచ్చా. మామా అల్లుళ్ళకు బెడిసీపోలేదూ. యేమీాలేదూ. అదంతా వుత్తదే. ఇప్పుడు కొత్తగా వక మనువు వచ్చిందనేది నిబద్దే, ఆయనకు లచ్చలుండేది నిబద్దే. ఇప్పుడొచ్చిన చిక్కేందంటే ఇంతపెద్దసమందం. దానంతటది వొచ్చినప్పుడు దాన్ని నేనె ట్టాపోంగొట్టొచ్చు. పిల్లకు లచ్చలువచ్చేదాన్ని పోంగొట్టితే పిల్లకు నేను చెడ్డచేసినవాణ్ణికానా? అదేమినాయం. దేముడి దట తప్పుచేసిన వాణ్ణేగదా? అని కేశవరావు యీాకొత్తమనువు పాతమనువుసందున యిరుక్కొని చిక్కులో సంకటపడుతూ వుండాడు. రామరావును యిడిచిపెట్టడం కేశవరావుకు సంతోష

మైనపనిగాదు. రామరావుని యిడిచిపెట్టాలసి వచ్చిందే యని కేశవరావు పడేసంకటము సూసేవాళ్లకే తెలుస్తుంది. నేను దినమ్మూ సూసేదాన్ని గనక నాకు తెలుసు. అన్నంగూడా సరిగాదినడంలా. యిట్టా ఆయన సంకటపడతా కొట్టుకుంటా వుంటె, మనపాటికి మనమేమో తమాషాలుగా, వుండేది ఒకటైతే పదిగా కలిపించి, ముచ్చట్లాడుకుంటాం.

నాలుగవది:—మామా అల్లుండ్లకు యకటాయించక పోతే, బిడ్డపుట్టింది మొదలుకొని రామరావుకు యిస్తాయిస్తా అంటావొచ్చినాయన యిప్పుడివ్వడం లేదనడం యెందుచాత. బిడ్డకువచ్చే సొత్తురాకుండా అడ్డపడడం పాపాలైతే చిన్నప్పట్నుంచి వకటిగాబెరిగి పెండ్లి చేసుకొందాం చేసుకొందాం అని వకరిమీద ఒకరికి మణుసుగలిగి ఎంతోఆశతో వుండేబిడ్డల యెడంజేయుడం పాపాలుగాదా? వకసారి వకరి కొకరిమీద మరులుగలిగితే అదంతసులబంగా వదుల్తుందంటమ్మే. నువ్వే చెప్పేంచూస్తాం.

అయిదవది:—కేశవరావు జెప్పేది యీమక్కువా; దయా యిదంతా కొన్నాళ్లయడమైతే మర్చిపోతాయి. యీ సొత్తుఅట్టాటిదిగాదు, పిల్లకుతప్పించలేని నష్టిగలిగించిన వాడ్నౌతానుగదా అని ఆయనకష్టం.

నాలుగవది:—అదిగో బైటపడింది. ఇదంతాసొత్తు మూలాన్నే వొచ్చింది. కొత్తసమందంవల్ల సొత్తుకావలసినంత వస్త్రాదికనక పాతసమందంపనికిరాకపోయింది.

మూడవది:—యీసొత్తు కేశవరావుకేమైనా చెందుతుందా? యేమైనాపిల్లకెగదా చెందుతుంది. కనకపిల్లకు మంచి చెయ్యడానికే ఆయనపాటుపడేదంతా, కష్టపడేదంతా, ఈవిధముగా నూరంతయుఁ బెద్దవారు పిన్నవారు నందఱకు నొకటే ప్రచారము. ఒకటేవిచారము. ఎవరినోట వినఁబోయినను, ఇది అక్రమము. అన్యాయమను వారేగాని యుక్తమనువారు లేరు. కేశవరావు మాత్రము తనమనస్సాక్షికి విరోధముగాఁ బోవ నంగీకరింపలేదు. "లోకులేమైననందురుగాక. రామన్నవియ్యమందలేకపోయినందులకై నామనసునందుగలిగిన సంతాపమునెంతయైన ననుభవింతునుగాక, న్యాయ్యము క్రమము అని నామనస్సుకు దృఢముగాఁ దోఁచియున్నమార్గమును విడువను" ఎవ్వరేమన్నను కేశవరావు మనసుమాఱలేదు.



# ఆశ్వాసము ౪

బుధవారమునాఁడు కృష్ణరావు కేశవరావును జూచు నట్లేర్పాటయి యుండెను. ఆయేర్పాటుమేరకుఁ గృష్ణరావు కేశవరావుగృహమునకు వచ్చిహాజారముకడనుండి తానువచ్చి యున్నసంగతిని గేశవరావుదగ్గఱకు శిష్యునితోఁ జెప్పిపంపెను. కృష్ణరావుగదిలోఁ బ్రవేశించుచుఁ గేశవరావుకు నమస్కరించుచు నేఁడు పెద్దలదర్శనమైనది. చాలసుదినము. మిక్కిలిసంతోష మైనది." అనెను. కేశవరావు కృష్ణరావును "చిరంజీవి సుఖీభవ" యనిదీవించి "నాయనా నీవునుముందుగాఁ జెప్పిపంపి రావలెనా, నీకు అడ్డమేమున్నది." అనెను దానికిఁ గృష్ణరావు "మామయ్యా; అట్లుగాదు అన్నియు వాడుకప్రకారము క్రమముగా జరుగవలసినదే" యనుచు కేశవరావు చూపిన కురిచిమీఁదఁ గూరుచుండెను.

కేశవరావు.—నాయనా నీవుపంపిన సుబ్బయ్యవచ్చి నాతోమాటలాడి నీసంగతి చెప్పినది మొదలుగా నిన్ను బ్రత్యక్షముగాఁ జూడవలెనని యెక్కువ అభిలాషగా నుండినది. నేఁడది నెఱవేఱినది; మిగుల సుదినము; మిక్కిలిసంతోషమైనది. కృష్ణరావు మామయ్యా ఆయనను గార్యాంతరముమీఁద అవసరముగా బంపవలసి వచ్చినది, లేనంతట ఆయనగూడ నాతోడ వచ్చియుండ వలసినవాఁడు."

కేశవరావు: —నాయనా! సుబ్బయ్య అన్నివిషయములు నాతో వివరముగాఁ జెప్పినాఁడు. సందర్భములన్నియుఁ జక్కఁగాఁ జర్చించినాఁడు. ఆయన చాలసమర్థుఁడు. ఇంగితజ్ఞుఁడు. ఆ ఎదుటివాని భావమును సులభముగా గ్రహించి తనభావమును జులకనగాఁ గోచరించునట్లు మృదుమధురభాషతో మనసుకు రంజకముగానుండునట్లు తెలుపఁ గలవాఁడు. కార్యసాధనమునందుఁ జాలసమర్థుఁడు. ఎంతచిక్కయిన సందర్భములోఁగాని ఎంతకష్టమైన సమయములోఁగాని నిర్భయముగ సమర్థించుకొనఁ గలఁడు. కార్యముసాధించుకొనుటకు అన్నివిధములఁ దగినవానినిబంపినావు."

కృష్ణరావు:—సుబ్బయ్య చిరకాలముగా మమునాశ్రయించి యున్నవాఁడు. చాలయోగ్యుఁడు. విశ్వాసముగలవాఁడు. స్వామికార్యమును దనకార్యముకన్న నెక్కువగఁ జూచువాఁడు. మా పెద్దపెద్ద వ్యవహారములలో నన్నిటిలో నీయననే పంపుచుండును. తమవంటి పెద్దలతో సంభాషింపనర్హుఁడు. తగినసామర్థ్యము గలవాఁడు. కనుకనే తమదగ్గఱకియనను బంపినాను. ఈయన పూనుకొనినపనిని దప్పక నెఱవేర్చుకొని రాఁగలఁడని నాకుదృఢమైన విశ్వాసము.

కేశవరావు:—నామనసునుద్రిప్పి యీసంబంధమువిషయములో నాకుఅభిప్రాయము గలిగించుటయందు ఈయన సంభాషణసామర్థ్యము ఈయనవినయము చాలఉపకరించినవి.

కృష్ణరావు:—ఇంతటికిని ఒక్కొక్క సందర్భములో విధిలేక ఎదుటివాదము కొంత మనస్సంకటమును గలిగించునది గానుండినను ధర్మమునువదలక. న్యాయ్యమునువీడక శాంతతతో ఎదుటివాదమును సమగ్రముగా విని అవసరమైనంతటఁ దన భావమును మార్చుకొనినమైన ధర్మమును బాలించు ననన్య సామాన్యమైన ఉదాత్తగుణము తమలోనుండబట్టి యిట్టిది సాధ్యమయినది. కార్యసాఫల్యము గలిగినది.

కేశవరావు:—ఇఁక మనము జాతకములఁబట్టి ముహూర్తమునకుఁ జక్కఁగవిచారించి లగ్నమును నిర్ణయింపవలెను.

కృష్ణరావు:— తమకు జ్యోతిషమునందుఁ జాలఁ బ్రావీణ్యముగలదని విన్నాను. మనకేవిషయము దెలిసియుండఁగా లగ్నముఁ బెట్టుటకు మనమన్యులదగ్గఱకుఁ బోవనేల. మనకున్న శ్రద్ధ యితరులకెట్లుండును. జాతకముల బరిశీలించి లగ్నమును నిర్ణయించిన బాగుగానుండునుగదా.

కేశవరావు:—అట్లే జాతకమును జూచి లగ్నమును నిర్ణయించెద. మనముపై బుధవారము మరలఁగలసి జరుగవలసిన కార్యక్రమమునకుఁ దగినయేర్పాటులు చేసెదము.

కృష్ణరావు:—నేనుఇంతలోగా రాజమహేంద్రవరమునకుఁ బోయివచ్చుటేల ? వ్యర్థవ్యయము. బందరులో మన బాగాళాఒకటి పెద్దదిఉన్నది. అదియిక్కడకుఁ జాలదగ్గఱ. పదిబారలకులోకువగానే యుండును. దానిలోఇప్పుడెవ్వరులేరు. ఈసందడిరోజులన్నియు నేనుదానిలోనే బసచేసియుండెద. బాడుగకొంచెము నష్టమైనను ఎక్కువసౌకర్యముగా నుండును.

# ఆశ్వాసము. ౫

(బుధవారమునాఁడు. ఏర్పాటు ప్రకారము, ఉభయులు కలిసినారు.)

కేశవరావు:—నాయనా జాతకమును జక్కఁగాఁ బరిశీలించినాను. పదినాళ్లలోఁగా అంతశ్రేష్ఠమైన లగ్నము కుదురలేదు. పై శుక్రవారముగాక అంతకుఁబై శుక్రవారము మధ్యాహ్నము సింహలగ్నమందు అమృత యోగములో ముహూర్తము మిక్కిలిచక్కఁగానున్నది. దానిని నిర్ణయించుకొనవచ్చునని నాఅభిప్రాయము.

కృష్ణరావు:—అట్లె శుభముహూర్తమున లగ్నపత్రిక వ్రాయించి అచ్చొత్తించి కావలసినవార్లందఱకుఁ బంపెదము.

కేశవరావు:—వ్యవధిచాలనున్నది. కావునఁగార్యములన్ని నెమ్మదిగఁ గొఱఁతలేకుండ జరిపింపవచ్చును.

కృష్ణరావు:—ఒక్కమాట తమతో మనవిచేయఁ దలచినాను. తమయభిప్రాయము వినఁగోరెదను. సాధారణముగా మనవారిలో వివాహాదికార్యములందు మితిమీఱినవ్యయము చేసి దానివలనఁగలుగు హాని ననుభవింపవలసి వచ్చినప్పుడు

చేయునదిలేక చింతించుట స్వభావముగానున్నది. అది అంత యుక్తమైనపద్ధతి కాదనినాభావము ఆవిషయములోఁ దమ యభిప్రాయము తెలపీయవలెను.

కేశవరావు:—మితిమీఱినవెచ్చముచేసి కుటుంబము లకుస్థిరమైన హానిగలిగించుట యుక్తముగాని, దురాచారమనియె నాయభిప్రాయముగూడ, అయిన అతిలోభమును గూడదు. వారివారిస్థితిననుసరించి మితిమీఱక యథోచితమైనవెచ్చము చేయఁదగును.

కృష్ణరావు:—ఇప్పుడీ వివాహ కార్యమునందుఁ గూడ అనవసరమైనవెచ్చమును మాని మితముగానే జరిపింపవలెనని నాయుద్దేశము. ధనమును గూడఁబెట్టుటకష్టముగాని వెచ్చించుట మిక్కిలి చులకన.

కేశవరావు:—నాయుద్దేశముగూడ ఈకార్యమునందు ఎక్కువ ఆడంబరము పెట్టుకొనవలెననిగాని అధికవ్యయముచేయ వలెననిగానిలేదు. మితముగానే జరుపవలెనని ఉన్నది.

కృష్ణరావు:—ఈ పెండ్లి ఒక్కదినముకార్యముగనే చేయుదము. అట్లుకాకఅయిదుదినములు చేయునెడల వ్యర్థమైన ద్రవ్యమును మనకును బరిజనులందఱకును అనవసరమైన దేహకష్టమును గాసియుఁ గలిగించుటతప్ప లాభమేమిలేదు.

కేశవరావు:—అట్లేచేయుదము. లగ్నమునకుసరిగా సక్రమముగా మాంగల్యధారణమగుట ప్రధానముగాని, తక్కిన వేడుకలన్నియు మనయిష్టముకొలఁది చేసికొనవచ్చును.

కృష్ణరావు:—ఇఁక వివాహసంబంధమైన ఏర్పాటుల గుఱించి నిర్ణయింపుము. వివాహకాలమందుఁ బెండ్లికూఁతురికి ఏమిపెట్టఁదలఁచినారు? ఇది కేవలముపద్ధతికొఱకే.

కేశవరావు:—పదియెకరాల పట్టాభూమిని వివాహకాలమందు ఆమెపేర వ్రాయింపఁదలచినాను.

కృష్ణరావు:—ఇరువది ఎకరములుగ వ్రాయించిన గణ్యముగానుండును. ఇది ఆమెకుఁజేరునదె, అన్యులకుఁబోవునది గాదుగద, ఊరకిలాంఛనార్థమే.

కేశవుడు:—అట్లె ఇరువది ఎకరములుగనే వ్రాయించె దనుదానికేమి.

కృష్ణరావు:—ఇంకనాసంగతి నేనే అడుగుచున్నాను. తమయొద్ద నాకింకజంకేమిటి? తమరునేను అందఱము నొకకుటుంబమువారమే కాఁబోవుచున్నారమే. భేదమేమున్నది. అయినను బెండ్లినాఁటిగుఱుతుగా నేదోయొకటిఉండవలెనుగద, నాకట్టిదేమి ఈయఁదలచినారు.

కేశవుడు:—రవలఅంటుజోడు ఉంగరములు, బంగారు చేతిగడియారము నిచ్చెదను.

కృష్ణరావు:—ఇవి ప్రాచీనాచారమునకుఁ దగియే యున్నవి. కాని ఈకాలములో మగవారు నగలను ఎవరుధరించు చున్నారు. ఈకాలమునకుఁ దగినవిగానుండిన బాగుగానుండును. నేనునాకుఁదోఁచినది తెలుపుదునా? ఇప్పుడీయూరికి ఒకమంచి మోటార్ కార్ విక్రయమునకు వచ్చియున్నది. దానిక్రయము ఇరువదివేలరూపాయలు. బండిచాలమంచిది. ఆవెలచేయునదే. దానికి ఇరువదిగుఱ్ఱముల బలమని పేరుగాని ఇరువదైదువఱకు వృద్ధికాఁగలదు. ఒక్కగాలెన్ పెట్రోలుకు పదునెనిమిది మయిళ్ళు పోఁగలదు. ఈబండికి ఋదిచాలఎక్కువ ననియే చెప్ప వలెను. వేగముకూడ ఒక్కగంటకు ఱువది మయిళ్ళు చులకనగఁ బోవుచున్నది. కదలిక యేమాత్రము లేదు. కార్ నుదీసిచ్చిన ఈకాలపువారి ననుసరించియుండును.తమకేమి తోఁచుచున్నది.

కేశవుడు:—తీసిచ్చునప్పుడు ఏదైనఉపయోగకరమైన దానిని దీసిచ్చుటేకదాయుక్తము. ఱాలుకానియెడల తీసిచ్చి ప్రయోజనమేమి? ఇంక మనము పెండ్లిపనులకారంభించి తర్వాగాఁ బూర్తిచేయవలసి యున్నది. శుభలేఖలను అచ్చువేయించుట కిప్పుడే యేర్పాటుచేయించెద, నేఁడుదినము బాగుగానున్నది. "శుభస్యశీఘ్రం"

అని చెప్పుచు కేశవరావు కృష్ణరావుకు సెలవిచ్చిపంపెను. పంపునప్పుడు, మనసులో, "ఇంతలోన ఇన్నికోర్కెలు.

ఇదేమిటి! భయంకరముగా నున్నదే” అని కొంతసంకోచము
కలిగినదిగాని వెంటనే దానిని సమాధాన పఱచుకొనెను.
“ తమయొద్ద నాకింక జంకేమిటి? తమరు నేను అందఱము నొక
కుటుంబమువారమే కాఁబోవుచున్నారమే, భేదమేమున్నది ”
అన్నాఁడు. కొంత చొరవకలిగినంతట ధారాళముగ మాటలాడు
వాఁడును, మనసులోనొకటి పెట్టుకొని పైకొకటి చెప్పక
నిష్కపటముగాను, నిష్కళంకముగాను దాఁపక అంతయుఁజెప్పు
వాఁడుగాను ఉన్నాఁడు. ఆతఁడే అయినంతటమేలే, చింతింప
వలసినదేమియు లేదు. దైవఘటనవల్లను జరగకతీఱదు. దానినాఁపు
టకుఁగాని మార్చుటకుఁగాని మనకుసాధ్యముగాదు అనిమనసు
కుదురుపఱచుకొని పెండ్లిపనులకు దిగెను. ఏదైననొకటి గొప్ప
పనిఁ జేయ స్థిరముగా దలచియున్నపుడుదానికేదేని అంతరాయ
ములుతటస్థించినంతట దానికిప్రతికూలమగునని అర్థముచేసి తొలఁగఁ
ద్రోయఁ బ్రయత్నించుట మనుజులకు సహజమైన స్వభావము.

ముహూర్తము సమీపించినది. బంధుమిత్రాదుల
కందఱకు వివాహోత్సవ పత్రికలును సకాలమున బంపిరి.
ఇల్లంతటను నచ్చినచో పోయినది చక్కఁబెట్టి గోడలకు సున్నము
పూసి ఎఱ్ఱమట్టిపెరుతీసిరి. ఇల్లంతయుఁ పెండ్లికళవహించి
శోభాయమానముగ నున్నది. భృత్యులందఱును దొరచెప్పిన
పనులన్నియు జెప్పినమేరకు నేలోపములేకుండ నెఱవేర్చు
చున్నారుగాని లోన ఎంతమాత్రము ఆహ్లాదముగాని ఆసక్తిగాని

ఉన్నట్లుకానరాదు. విద్యుచ్ఛక్తిచేత ఆడింపఁబడు బొమ్మల వనులవిధముగా నున్న వేకాని సహజమైన ఉత్సాహపూరితమగు పూనికతోఁ జేయుపనులవలెఁ గాన్పింపలేదు. ఇఁక ఇంటివారి స్థితిని జెప్పఁగష్టమగుచున్నది. మొగములందు ఎంతమెట్టుకుఁగాని కళలేదు. చూచువారి మనస్సులందుఁగూడ జాలికొలుపు చున్నది. ఎట్టకేలకు నియమిత కార్యములన్ని సక్రమముగ జరిగినవి.

మంగళతూర్య నినాదములతో ముహూర్తదివసము వచ్చినది. పనివాండ్రు తమనైపుణ్యమునంతయుఁ జూపుచు పెండ్లిచవికెనలంకరించిరి. స్తంభములకు గెలతోనున్న అనఁటి చెట్లులఁగట్టి అంతటఁ బచ్చతోరణములఁ దవిలించిరి. పందిటికిఁ బలు తెఱఁగుల పూసరములను వినోదకరముగ వ్రేలఁగట్టిరి. బంధువులు మిత్రులు మొదలయినవారందఱు వచ్చిచేరిరి. లోఁగిలంతయు నిండి సందడిమెండై మేళముధ్వనితోఁ గలిసి ఒకనితోనొకఁడుమాటలాడవలెనన్న నఱచిచెప్పవలసినదేకాక చేతులసైగలుగూడఁ దోడుపడవలసివచ్చినది. కొంతమందికి గొంతులుతాచిపోయినవి.

అప్పుడు కేశవురావుగారు తనమిత్రునొకని వీరయ్యను బిలిచి మీరు పెండ్లికుమారునియొద్దకుఁ బోయి "లగ్నము సమీపించుచున్నది; మీరు త్వరగా మంగళస్నానముచేసి

ముహూర్తమునకుఁ దరలివచ్చినంతటఁ బెండ్లిపనులన్ని నిదాన ముగాఁ గ్రమప్రకారము సాంగముగా జరిగించుటకు వ్యవధి యుండును. ఆలస్యము చేసినంతటఁ దొందరపడవలసి వచ్చును ” అనిచెప్పి ఆయనను స్నానమునకుఁబంపి రావలెను అని వీర య్యతోఁ జెప్పించెను. వీరయ్యపోయి కృష్ణరావుతో మాట లాడుచుండఁగా అక్కడనుండిన కార్ నడుపునతఁడు కృష్ణరావును గొంచము ఎడముగాఁ బిలుచుకొనిపోయి “ అయ్యా యిది మంచి అదును దొరికిందిమనకు మీకిస్తామన్న 'కార్' వూడదీసి కొనేదానికి. ఇప్పుడు మనము కొంచెం బిగువుజూపితే 'కార్' తప్పక మనచేతికొచ్చింది, కొంచెంలోపడి మెతువుజూపినా మంటే అదును తప్పిపోయినట్టే. పెండ్లి ఐనాక జుట్టుపట్టుకొం టారు, యిదిగోతీసిస్తా, అదిగోతీసిస్తా యిదిట్టాబోయిం దదట్టా బోయిందంటా కాలంగడిపేసి కడకు ముగించేయేస్తారు. “ మీరునాకు 'కార్'ను దీసిస్తానంటే దాన్ని తొరగా తీసి పంపండి. దాన్‌లో పెండ్లికితల్లివస్తాయిప్పుడే” అన్ చెప్పంపండి. ఆయనతో గూడా నన్నూ బాయ్ చెప్ మంటే పోయ్ చెస్తా ఐతే వాళ్ళు నువ్వెవుడ్రా అంట్రేమో అంత కాకితంలో రాసియ్యండి మిగతంతా నేమాట్లాడతా ” అని 'కార్' వాఁడు కృష్ణరావుకు బోధించి లోఁబఱచుకొనినాఁడు. “ మామగారు నాకుఁ దీసి చ్చునట్లు చెప్పిన 'కార్' పంపినంతట దానిలోనె పెండ్లికిఁ దరలి వచ్చెద ” నని మామగారితో మనవిచేయుమని, వీరయ్యతోఁ

గృష్ణరావు చెప్పెను. వీరయ్య ఏమితోఁపక నిర్విణ్ణుఁడై యట్లే కొంతసేపు నిలుచుండి బుద్ధిని స్థిమితపఱచుకొని కృష్ణరావుతో నిట్లు చెప్పెను. "నాయనా అట్లుచెప్పిన నెట్లు? ఉండినట్లుండి యిప్పుడు 'కార్'ను దేవలసినదన్న ఁదెట్లు సాధ్యమగును. కార్యము అతి సమీపములోనున్నది. లగ్నము గడియలమీఁద నున్నది. ఇంతలోఁగా 'కార్'ను గొనితెచ్చుటకు వ్యవధెక్కడ నున్నది? కార్యము కాఁగానే ఁదేపనిగాఁ బ్రయత్నముగానుండి రేపు ఎల్లుండిలోఁగా 'కార్'ను దీసిచ్చెదరు. దానికి నేను జవాబుదారిచేయుదును. ఈచెప్పినది మొన్నఁగాని నిన్నగాని చెప్పియుండిన ఇప్పటికే తీసియుందురు. కార్యమునకు అభ్యంత రముగాకుండ ఇంకొక బండిలో రావలెను."

బండివాఁడు:—(కృష్ణరావుగారితో-) అయ్యా బండి నిండామంచిది. దానికి యెన్నో బేరాలు వస్తుండాయి. ఇప్పుడు తప్పితే అది మనకింక రాదు.

కృష్ణరావు:—పెండ్లి గుఱుతుగా ఆబండిని నాకుఁ దీసి యిచ్చునట్లుగా మామగారు చెప్పియున్నారు. అదిమొదలుగా నేను పెండ్లికి ఆబండిలోనే ఊరేగింపుగా రావలసినదని నిర్ణ యించుకొనియున్నాను. దానికింక మార్పులేదు. నేను ఆబండి లోఁదప్ప యింకొక్కబండిలోఁ బెండ్లికిఁ దరలిరాను; అది నిర్ణ యము; ఈసంగతి మామగారితోఁ జెప్పవచ్చును. వీరయ్యను

ఏమిచేయను దోఁపక ఏమిచెప్పనులేక ఖిన్నమైన మనస్సుతో చిన్నవోయిన ముఖముతో కేశవరావుదగ్గఱకుఁ బోయెను. కేశవరావుకు ఈవిషాదకరమైన విషయము నొక్కటేఁ జెప్పిన ప్రమాదకరమగునేమోయని ముందుఁ గొంత పీఠికవేసి నిదానముగా క్రమముగాఁ జెప్పఁదలచెను. వీరయ్య కేశవరావును జూడఁగనే యిట్లు చెప్పెను. "అయ్యా అక్కడి సందర్భము లేమి చక్కఁగాలేవు. నీచ సహవాసము నీచాలోచనలు ఎక్కువగా నున్నవి. పెద్దచిన్న మర్యాద లేమియు లేవు. బండివాఁ డెంతచెప్పిన నంతగానున్నది. వానిని నాతోఁగూడఁ బొమ్మన్నారు. వాఁడు ఇంకేదో దుర్బోధము చేయుటకుఁగాఁ గొంత నిలిచి నాఁడు. ఇప్పటికి వచ్చుచుండును. తమరు పెండ్లి గురుగా ఏదో 'మోటారు' తీసియిత్తునని చెప్పి యున్నారఁట దానినిప్పుడు తీసి పంపినంతట దానిలోఁ బెండ్లికిఁ దరలివత్తురట. దానిని గురుగాఁ దీసిచ్చునట్లు చెప్పినది మొదలు ముహూర్తమునకు దానిలో మెరవడిగా వచ్చునట్లు అన్ని యేర్పాటులు చేసికొని యున్నారట దానిని మార్చుటకు వీలులేదన్నారు." ఈబండిని దీసిచ్చుటకు నేడు వ్యవధి ఎక్కడనున్నది. రేపుతీసిచ్చుటకు నేను 'జవాబుదారి' అని చెప్పినను ఒప్పలేదు.

ఇట్లు చెప్పుచుండగానే బండివాఁడు నొకకాగితము చేతిలోఁబట్టుకొని, శివుఁడు నిలువుమని ఆఁపుచుండినను ఆఁగక

లోపలఁ బ్రవేశించి కాగితమునుజూపుచు "మంచిబండయ్యా ఇదిపోతే మనకింక ఇట్టాటిబండి దొరకదు. దానికిబేరాలు వస్తా వున్నాయి రేపుదాకా నిల్చివుండేటట్టులా" అను నప్పటికిఁ గేశవరావుగారు మండిపడి ఆకాగితమునుజింపి వాని ముఖాన విసరివైచి "నేనతనికేబండిగాని తీసిచ్చుటలేదు అతఁ డిక్కడకు రావలసిన పనియే లేదని చెప్పుపో!" అనగా బండివాడు "మంచిబండయ్యా ఆలస్యంజేస్తే మిఁగిలిపోతుంది. అవతల వోట్లో యేలుబెట్టుకోవాల్సిందే" అనునప్పటికి కేశవరావు ఆగ్రహమూర్తియై "శివా, వీనిని బైటకునెట్టు" అనిరి. శివుఁడు బండివానిని బైటకునెట్టుకొని పోయెను. కేశవరావు ఉగ్ర మూర్తియై యక్కడఁజేరియున్న బంధుమిత్రాదుల నందఱ నొక్కటఁ గలయఁజూచెను. ఆగ్రహాతిరేకముచేత వారికిదేహ మంతటను గంపముగలిగినది. కన్నులెఱ్ఱనైనవి. మొగము మీఁదను మెడమీఁదను నరములు ఉబ్బినవి. మొగమంతయు జేగుఱించినది. నాసాపుటములు నుబికెను. గొంతులోఁ ఉంట బెట్టినట్లయినది. డగ్గుత్తికలో మాటకూడ బైటకురాదు. ఆయనను జూచువారలందఱకును లోన నొకవిధమైన గాంభీర్యమును, భయమును, గోపమునుగలిసి ముప్పిరి గొన్నట్టయినది. అంతకు ముందటి క్షణములో సంకులసంభాషణధ్వనులతో నిండి యుండిన అగ్రహము, రూపుఁదాల్చిన ఆగ్రహదేవతా స్వరూపమో యన్నట్లు దీపించుచున్న కేశవరావుముఖమును

జూడగనే తన్నిసంభాషణములు ఎక్కడివక్కడఁ దటాలున నణఁగిపోయిఇల్లంతయు నిశ్శబ్దతను వహించినది.

అప్పుడు కేశవరావు, లోని ఉద్రేకమును బలవత్ప్రయత్నముతోఁ గొంతవఱకు అణఁచుకొని, అక్కడఁగూర్చియున్నవార లనందఱను ఒక్కటఁజూచి, అందులోఖన్నఁడై సమీపమున నిలిచియున్న రామన్నపై దృష్టిసారించి, కొంతసేపట్లేచూచి, మాట వ్యక్తపడుటకు గొంతుసవరించుకొని "నాయనా రామన్నా కొంచెము ఇటురా" అనెను. రామన్నయును గరు ణారసపూరితములై యొప్పారుచున్న కన్నులతోఁ దన్నుఁగ వచ్చి ముందటనిలిచెను. కేశవరావు ఆయనతలమీద నెనరుతోఁ జేయిడి "నాయనానీవుచిన్నవాఁడవైనను నేను క్షమింప నిన్ను గోరవలసివచ్చినది." అనగనే రామరావుకు మనసంతయుఁ గరఁగి కన్నులగుండఁ బొంగిపాఱుచున్నదా యన్నట్లుకన్నీరు జాఱఁ దొడఁగెను. కేశవరావుకును గన్నులనీరుక్రమ్మెనుగాని యంతటితో నడంచుకొనఁగలిగెను. అడఁచుకొని యిట్లుచెప్పెను. "నాయనా ఈమనువువిషయము చర్చించుచుండినప్పుడు నీవు "మామయ్యా ధనమేసర్వముగాదు. గుణములనుగూడ విచా రింపఁబనిలేదా" యనిసూచినగాఁ జెప్పినావు. బాలయ్యా విషుల మునాను గఠినముగాఁగూడఁ జర్చించినాఁడు. అప్పయ్యఁగూడ నాబుద్ధి తిరిగినదికాదు. అతనికి గుణములేదనుటకు ఏసూచనగాని

అప్పటికిన్నీ దొరకఁబడలేదు నాపట్టు వదలలేదు. ఇప్పుడతనికి గుణము లేకపోవుటేకాక దుర్గుణములెక్కువగా నుండుటకూడ బయలు పడినది. నాబుద్ధియును బూర్తిగ మారిపోయినది. ఈసంగతులు నిదానముగ మాటలాడ వచ్చును. ఇప్పుడుద్దేశించియున్న సుముహూర్తలగ్నము నీజాతకమునుబట్టి చూడ మిక్కిలియుత్తమము గానున్నది. లగ్నముచాలదగ్గర నున్నది. నీవువెంటనే మంగళ స్నానముచేసి అరగంటలోగా రావలసినది. శివా ఆయనతో నీవు గూడఁబో" ఇదివినుటతోడనే అటంజేరియుండిన అందఱకును క్రొత్తగాఁ బ్రాణము పోసినట్లుండినది అందఱిమొగములందును జీవకళపుట్టినది. మంగళవాద్యములు మ్రోఁగ మొదలుపెట్టినవి. పెండ్లికొడుకును పెండ్లికూతురిని బిలుచుకొనివచ్చి పీటలమీఁదఁ గూర్చుండఁబెట్టిరి. అప్పుడక్కడఁ జేరియుండినయందఱి మనస్సు లలోనిండియుండిన సంతోషమును నాహ్లాదమును నుత్సాహ మును నొక్కుమ్మడి బయల్పడినట్లు అందఱునొక్కట నిల్చి సంతోషముతో గానముచేసిరి.

"ఆనందమానంద మాయెనే
మనరామూఁడు పెండ్లికొడూకాయెనే
మనసీతమ్మ పెండ్లికూతూ రాయెనే,"

మాంగల్యధారణమైనది. అప్పుడు కేశవరావు పెండ్లి పీటలమీఁద నిలుచుకొనియున్న నూతన వధూవరుల యెదుట

నిలిచి ఆనందపూరితమైన మనసుతోఁ గద్గదస్వరముతో దంపతుల నాశీర్వదించి శిరముల నక్షతలనుంచి రామరావునుద్దేశించి "నాయనా మనవారందఱును యిందులోముఖ్యముగా మనము ముప్పురము తప్పింపనలవిగాని ముప్పులోఁబడనుంటిమి. దైవ ఘటనవలన నది తప్పినది. నీయోరిమి నీతాలిమి నిన్నురక్షించి నవి. దైవకృపచే నవినిన్ను సర్వదా సర్వథారక్షించుఁగాత! అని దీవించి పెండ్లికూతురితోఁ

మంజరి:- బాల్యంబుఁ జక్కఁగాఁ ♦ బరపినావమ్మ
గార్హస్థ్య మిఁకసుగాఁద ♦ గ్రహియింపు మమ్మ

ద్విపద:- మగనికి దైవంబుగా ♦ మది నెన్న వలయు
మగనికన్నను మేలు ♦ మహిలేదు సతికి
మగనిమాటకుఁ దప్పి ♦ మాఱు పల్కంగ
మగనితో వాదాఁడ ♦ మగువకుఁ దగదు.

కినిసినఁబతి మెల్లఁ ♦ గినుకఁజల్లార్చి
మనసును గరఁగించి ♦ మగనినేలుకొను
మంచితనము చేత ♦ మగని మెప్పింపు

కొంచమేనెడమీఁకుఁ ♦ గోపంబు కలుగ
వంచన మదినెందు ♦ వఱలనీఁబోకు
మించుకైనను గీడు ♦ నెన్నఁగా వలదు
మంచినేసర్వథా ♦ మదినిల్పు మెపుడు

సంచితకర్మముల్ ♦ సమయంగ మెలఁగు
పతిమేలుసర్వదా ♦ భావించుచుండు
పతిమేలెతనమేలు ♦ పడఁతికిధరణి
పరుషంపు మాటలఁ ♦ బలుకఁగావలదు
విరసంబుగారాదు ♦ బిగ్గర నగఁగఁ
కలదన్న గర్వంబు ♦ గలుగనీఁ బోక
కలుగ లేదను చింత ♦ కట్టకు మెదను
కలిమిలేములు జే త్రి ♦ కలనరంబులెగ
కలదేమొయొక్కట ♦ కలుగకపోదు
నరకంబునందె నైమె ♦ నను తృప్తిగలుగ
నరకంబుస్వర్గమౌగా, ♦ గలుగ దేగా దృష్టి
నాకంబు గూడను ♦ నరకంబు కన్న
శోకంబు గల్గించు, ♦ సుఖము తృప్తియెగ
పెద్దలఁ గనుభక్తిఁ ♦ బిన్నలఁ బ్రీతి
ఉద్దవారలఁ గాంచు ♦ యుక్తంబుగాను
మేలుకీడులఁ దాలి ♦ మిని వీడరాదు
నేలయందేమైన ♦ నెటితప్ప వలదు
నగలునుబుట్టముల్ ♦ నశియించు నిలను
సుగుణంబె సాధ్వికి ♦ సురుగనిసొమ్ము
ధనమును ధాన్యముల్ ♦ దాటింపలేవు
తనమంచిచేఁ దాను ♦ ధన్యగావలయు

చుంగులు వాటెడు ♦ సొగసుచీరలును
బంగారు సొమ్ములు వన్నెరయగా మేను
సింగారముల్ గావు ♦ సిద్ధంబు సతికిఁ
బొంగారు పతిభక్తి ♦ పోలుపైన తొడవు

ఈరీతి వర్తించి ♦ యిరుప్రక్క వారి
గౌరవంబును బెంచి ♦ ఘనత వహించి,
సీతమ్మ మాయమ్మ ♦ సిరులెల్లఁ గనుమ
ఖ్యాతిగాఁ బతితోడ ♦ హాయిగామనుము
తలిదండ్రులైన సీ ♦ తారాము లెపుడు
నిలువేల్పులై మిమ్ము ♦ నేలుచుండెదరు.

బుధవిధేయుఁడు

పానగల్ మహాల్ పానగల్లు } పానగంటి పార్థసారథిరాయనింగార్,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి. కా. 500 24-6-48

# సవరణపత్రము

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | ౧౭ | ధ్యాక్ కసి | ఛ్యాక్ అని |
| ౬ | ౧౩ | తూలివారల | తూలివారలు |
| ౬ | ౧౫ | నలల నీటిలో | వలల నీటిలో |
| ౬ | ౧౫ | వలలఁగొనుచు | లలఁగొనుము |
| ౯ | ౨౦ | రాజులగుట | వరులువగుట |
| ౧౦ | ౬ | యూతటాలున | మొఁదటాలున |
| ౧౨ | ౧౩ | నిర్భంధ | నిర్బంధ |
| ౧౨ | ౧౫ | దుఃఖ మెల్లచ్చు | దుఃఖ మెల్లచ్చు |
| ౧౬ | ౬ | బహూకాలముండె | బహుకాలముండె |
| ౨౨ | ౨ | యూయుధముల | గ్యాయుధములు |
| ౨౯ | ౧౧ | లోభాధ | లోభాది |
| ౨౯ | ౧౫ | నిర్భంధింప | నిర్బంధింప |
| ౩౦ | ౧౭ | యీసుష్ల | ఇసుష్ల |
| ౩౧ | ౫ | కూర్చుచుండిరి | కూర్చుండిరి |
| ౩౧ | ౬ | ఓడపక్కను | ఓడప్రక్కను |
| ౩౧ | ౧౧ | ననఁగా | ననఁగారామయ్య |
| ౩౧ | ౧౬ | యొకనినొకఁడా | యొకనికినొకఁడా |
| ౩౨ | ౩ | పెద్దతుపాను | ఁబెద్దతుపాను |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩౨ | ౧౧ | దింపుటకు | దించుటకు |
| ౩౨ | ౧౫ | దూరము | దూర |
| ౩౫ | ౧౮ | చింతలో | చింతలో |
| ౩౮ | ౫ | రామన్న | రామన్న |
| ౩౮ | ౬ | గడు ప్రీతి | గడు ప్రీతి |
| ౩౯ | ౧ | కేశవరావు:-ఆయనను గూరుచుండనియోగించి | |
| ౩౯ | ౧౬ | చప్పగించి | ఒప్పగించి |
| ౪౦ | ౧ | కుటుంబమును | కుటుంబములు |
| ౪౦ | ౧౧ | నామమువిని | నామమువినివిని |
| ౪౦ | ౧౪ | యుకి | యుక్తి |
| ౪౨ | ౧౭ | గాంచన | కాంచన |
| ౪౩ | ౭ | కేశవురావు | కేశవరావు |
| ౪౩ | ౮ | కేశవురావు | కేశవరావు |
| ౪౩ | ౧౫ | ధైర్యము | ధైర్యము |
| ౪౪ | ౮ | నప్పటికి | నప్పటికి |
| ౪౪ | ౧౨ | పోయినది | పోవునది |
| ౪౫ | ౫ | జంకువారుకాదే | జంకువారుకారే |
| ౪౫ | ౭ | త్రోటుపాటు | తొట్రుపాటు |
| ౪౫ | ౧౭ | అక్కచెల్లెండ్లు | అక్కసెల్లెండ్రు |
| ౪౬ | ౧ | యుండెను | యున్నది |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౫౦ | ౧౧ | తలగిట్టువున | తలగిట్టామని |
| ౫౪ | ౩ | వ్రంతురనియు | వ్రింతురనియు |
| ౫౭ | ౧౨ | తీరదని | తీఱదని |
| ౬౦ | ౧౧ | దెలిసినంట | దెలిసినంతట |
| ౬౫ | ౭ | నిక్కమొ | నిక్కమో |
| ౬౫ | ౧౦ | ఎనకేమి | యినకేమి |
| ౬౫ | ౧౨ | ఏనకేమి | యినకేమి |
| ౬౫ | ౧౩ | ఇదేమిన్యాయమమ్మా | యిదేమిన్యాయమమ్మా! |
| ౬౬ | ౪ | వాళ్లెవరైనా | వాళ్లెవ్వరైనా |
| ౬౬ | ౮ ౯ | కట్టుకున్నాది | కట్టుకుండాది |
| ౬౬ | ౧౪ | కట్టుకున్నాది | కట్టుకుండాది |
| ౬౬ | ౧౮ | వుంటుంది | వుంటాది |
| ౬౭ | ౧ | వాళ్ళకు | యీళ్ళకు |
| ౬౭ | ౩ | నారు | నాఁడు |
| ౬౭ | ౪ | గనుక | గనక |
| ౬౭ | ౯ | తీసుక | తీసక |
| ౬౭ | ౧౧ | తీసుక | తీసక |
| ౬౮ | ౨ | సంకటము | సంకటం |
| ౬౮ | ౮ | మొదలు | మొదులు |
| ౬౮ | ౯ | డివ్వడం | డియ్యడం |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౬౯ | ౭ | విధముగా | విధంగా |
| ౬౯ | ౭ | నూరంతయుఁ | నూరంతా |
| ౬౯ | ౭ | నందఅకువొాకటే | నదంరికివకటే |
| ౭౧ | ౧౫ | చుండును | చుండును |
| ౭౧ | ౧౭ | కియున | ీయన |
| ౭౧ | ౨౧ | విదేయ | విధేయత |
| ౭౨ | ౬ | నుండఁ | నుండు |
| ౭౨ | ౧౩ | కెల్లుండును | కెల్లుండును తమరే |
| ౭౪ | ౧౮ | ద్రవ్యమును | ద్రవ్యనష్టమును |
| ౭౫ | ౫ | యింపము | యింతము |
| ౭౬ | ౧౨ | తోచు | తోఁచు |
| ౭౬ | ౧౪ | కేశవుడు | కేశవరావు |
| ౭౯ | ౨౧ | చేయమని | చేయుమని |
| ౮౦ | ౨ | నేపు | సేపు |

